JAGATI Rs. 2-00 January 1988

33rd Year of Publication

# జగతి

ఎడిటర్ : చందూర్

జనవరి – 1988



'నిన్ను వొదిలేసి రాకెట్ వెళ్లిపోయిందేమిటి ?'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : దుర్గాబాయి దేశ్‌ముఖ్

# నిమ్మతొనలు



డాక్టరుగారూ, నేను విపరీతమైన లావుగా ఉండటంతో మా దాంపత్యంలో సుఖం లేదు. ఏదైనా చిట్కా చెప్పండి ?' అన్నాడు పేషంట్.

'రోజుకి 10 మైళ్ళ చొప్పున పది రోజులు నడిచి, ఆ తర్వాత చెప్పండి ఎలా ఉందో.'

పదిరోజుల తరువాత ఫోనులో: 'హలో డాక్టరుగారూ - నేను రోజుకి వరుసగా నడిచానండీ....'

'ఓహో మీరా ? ఇపుడు ఎలా ఉంది మీ దాంపత్యం ?'

'ఏం చెప్పమంటారు ? ప్రస్తుతం ఇంటికి వందమైళ్ళ దూరంలో వున్నాను.'

—అమాజీ సర్కార్
ఆల్‌హస్సా

మునుపటి రోజుల్లో శ్రీధర్‌గార్ని ఒక్క మాటంటే చాలు. అందర్ని చావచితక బాదేవాడు ... ఇప్పుడే మిత్రూ మొహాన ఉమ్మేసి బండబూతులు తిట్టినా నవ్వుతూ నమస్కారం పెడుతున్నాడేమిటి ?'– ఆశ్చర్యంగా అడిగాడు పరంధామయ్య మాష్టారు విషయం అర్థంగాక.

"వాడు త్వరలో రాజకీయ నాయకుడు కాబోతున్నాడు, సార్'' అని చెప్పాడు శేఖర్.

—సెల్వి
నందిగామ

పార్క్‌లో ఓ ప్రేమ జంట మాట్లాడుకుంటున్నారు. 'నిజం చెప్పు, నన్ను మోసం చెయ్యకుండా పెళ్ళి చేసుకుంటావు కదూ ?'- అనుమానంగా అడిగింది ఆదిలక్ష్మి ఆనంద్‌ని.

"నా మూడో భార్య మీద ఒట్టు–తప్పకుండా చేసుకుంటాను''

—క్రిష్ణశ్రీ
తెనాలి

పరమేశం పరిగెత్తుకుంటూ వచ్చి తన మిత్ర బృందముతో చెప్పాడు : 'నిన్న రామాపురంలో ఆకాశంలో నుంచి నీళ్ళు పడ్డాయట' అని. మిత్ర బృందం ఆశ్చర్యపడి పరమేశంతో సహా రామాపురం బయలుదేరి వెళ్ళి ఎదురుగ వస్తున్న రామయ్యను అడిగారు : 'నిన్న మీ ఊళ్ళో ఆకాశంలో నుంచి నీళ్ళు పడ్డాయట - నిజమా ?'

"ఔను, బాబు, నిన్న మా ఊళ్ళో వాన పడింది''

—కె సదానంద
పలమనేరు

పరీక్షలో ఫెయిలయినా సంతోషంగా వున్నావేమిటి? ఆశ్చర్యంగా అడిగింది శారద.

'మా డాడీ పాసయితే - కాలేజీ - ఫెయిలయితే మ్యారేజీ - అన్నారు' అంది నీరజ.

—బి వెంకటేశ్వరావు
రుద్రారం

ఒక మెజీషియన్ తన ప్రోగ్రాం ప్రారంభిస్తూ ప్రేక్షకుల మధ్యలో నుండి ఒక కుర్రాడిని పిలిచి: 'చూడు, బాబూ, నేనెవరో నీకు తెలియదుకదా' అన్నాడు.

దానికా కుర్రాడు 'అవును, డాడీ' అన్నాడు

—జియస్ శర్మ
అమలాపురం

మా అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానంటున్నావు మరి కుటుంబాన్ని పోషించే స్తోమతు ఉందా' - కాబోయే అల్లుడిని అడిగారు మామగారు.

"ఉందండీ! కాని మీ కుటుంబాన్ని మాత్రం కాదు"- తడుముకోకుండా చెప్పాడు కాబోయే అల్లుడు.

—కె నాగేశ్వరావు
నరసారావుపేట

బాబూ, ప్రేమ మీద ఒక్క మాటలో నీ అభిప్రాయం చెప్పరా? - అడిగాడు రాము.

"ప్రేమ గుడ్డిదిరా" – సింపుల్‌గా అన్నాడు సాయి.

'ఆ ప్రేమగురించి కాదురా, బాబూ, నేనడిగింది - మన క్లాసులో ప్రేమ గురించి నే చెప్పమన్నది.'

—మాధవి
నందిగామ

నీ కోసం రోజూ కారేసుకొచ్చే ఈశ్వర్‌ని చేసుకోవా? ఎందుకని' - ప్రశ్నించింది తల్లి.

'అతను మెకానిక్ ఏమోనని నాకు అనుమానంగా ఉందమ్మా!'

—జి రాము
నందిగామ

జి. పుల్లారెడ్డి
స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు
ఫోను: 230833

కర్నూలు
ఫోను: 20288, 21445

# పాఠకుల తీర్పు

మాన్యుట శ్రీ చందూర్ గారికి నమస్కారం: నవంబరు సంచికలో కర్మయోగి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావు గారిని గురించి మరో మహనీయుడు డా॥ వియన్ శర్మ గారి స్మృతులు మననీయంగా వున్నాయి. శ్రీ రావుగారు అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రప్రాంత వయోజన విద్యాప్రచార గౌరవ డైరక్టర్‌గా పని చేసినపుడు, పదిరోజులుపాటు వుపన్యాసాలను కన్నడం చేసే అదృష్టం, వారితో పర్యటించడం నా జీవితంలో చిరస్మరణీయం. జాతీయోద్యమానికి గట్టి పునాదులు వేసిన ఆ మహనీయుని ప్రభుత్వం విస్మరించింది. జనులు, 'జగతి' వారిని స్మరించుకోవటం ముదావహం.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప -4

డియర్ చందూర్‌గారికి నమస్కారములు : ఎప్పుడూ 'జగతి' పత్రికను పొగడటమేనా, ఒక్కసారైనా విమర్శించకుంటే బాగుండదేమో అనుకుంటాను. సరే, విమర్శిద్దామంటే, ఏమని విమర్శించటానికీ వీలే లేదు.... పాఠకుల బలహీనతల్ని ఆధారంగా చేసుకుని, స్వలాభం కోసం నడిచే వ్యాపార పత్రికలకన్నా, పాఠకుడికీ పత్రికక్కీ మధ్య చక్కని అనుబంధాన్ని ఏర్పరిచే 'జగతి' పత్రిక ఎంతో మిన్న. ఇది పొగడ్త కాదు - నా గుండెల్లోంచి వచ్చిన అభినందన కుసుమం.

—జి రాము
నందిగామ

ఎంతోమంది ఆర్తిని పంచుకుని వారికి మీ చల్లని మాటలతో ఓదార్పు నిచ్చి, వారి జీవితాలకే అర్థం కల్పిస్తున్న మీ దంపతులు ధన్యజీవులు. మీరు మీ కుటుంబమూ సుఖ సంతోషాలతో ఉండాలని కోరుకుంటున్నాను.

—జి ఉష
హైదరాబాదు-7

చందూర్ గారికి నమస్కరించి రాధాక్రిష్ణ వ్రాయునది: 'జగతి' చదువుతున్నాను. చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది. మీరు అనువదించిన "జీవన మార్గం" చదివాను. ఎలినార్ రూజ్‌వెల్టు రచన ద్వారా ఎన్నో విషయాలు తెలుగువారికి తెలియపర్చారు. 'జగతి' లోని 'డైరి?' చాలా బాగుంటున్నది. నిమ్మతొనలు సూపర్. మీవంటి మేధావులు మాకు మార్గదర్శకులు.

—వి రాధాక్రిష్ణరెడ్డి
హనుమాన్ జంక్షన్

# ప్రాచీన సాహితి

వలపు వహించె గంధగిరి వాత పరంపర భూరి భూజ శా
ఖలు చిగిరించె నింపెసగె గాకలి కోకి లంచు జెక్కులం
బలుచని ఘర్మ బిందువులు భామలకుం బ్రసరించె నెయ్యోడం
జెలువు ఘటింప జాలదు విశేష వసంత సమాగమం బిలన్

—భర్తృహరి

☼

పాలన లేని భూపతిని గొల్చుట రోత
యౌదార్యహీనుని నడుగ రోత
కులహీన జనులతో గలహించుటయు రోత
గుణహీన కామిని గూడ రోత
పాషండ జనులపై భ్రాంతి నొందుట రోత
మద్యపాయుల తోడ మైత్రి రోత
తుచ్ఛంపు బనులకు నిచ్చనొందుట రోత
చెలగి సద్గురు నింద సేయ రోత
వేదబాహ్యుల విద్యలు వినుట రోత
క్రూరుడైనట్టి హరిభక్తు గూడ రోత
మదరిపు విపాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్త సంత్రాణశీల

—వేణుగోపాల శతకం

☼

బళిరా సత్కవి వౌదు నిక్కమ తగన్ భావించి నీ వన్న యా
యెల ప్రాయంపు మిటారి కత్తెల బెడం గే నెందునుం గాన, వా
రల డోలాచల నోచ్చలచ్చరణముల్ త్రైవిష్టప స్త్రీల యౌ
దల దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి? యొప్పే యగున్

—పింగళి సూరన 'కళాపూర్ణోదయం'

# ఎ త్రికేళ నాటి పిక్చర్

## వియన్నెస్ వారి 'జ్ఞానేశ్వర్'

భారత చలనచిత్ర సీమలో శాంతారామ్ ప్రతిభ అసమానమైనది. నిన్న మొన్నటి దోఆంఖె బారా హాత్, నవరంగ్ కానీయండి, వెనుకటి రోజులలోని ప్రభాత్ చిత్రాలైన దునియా న మానె, ఆద్మి, జ్ఞానేశ్వర్ వంటివి కానీయండి - అవి ఆయన ప్రజ్ఞాపాటవానికి నిదర్శనాలు. ఈ చిత్రానికి దర్శకులు శాంతారామో, లేక దామ్లె అండ్ ఫతేలాలో, మాకు అంతగా గుర్తులేదు. కాని క్రెడిట్ టైటిల్స్‌లో ఎవరి పేరున్నప్పటికి, ఆనాటి ప్రభాత్ చిత్రాలలో శాంతారామ్ ముద్ర స్పష్టంగా వ్యక్తమయేది. సుమారు 22 సంవత్సరాలకు పూర్వం తయారయిన ఈ చిత్రాన్ని తెలుగులోకి డబ్ చేసిన నిర్మాతలు, విడుదలకు పూర్వం పత్రికలవారికి చూపారు. చూస్తున్న పత్రికా ప్రతినిధులందరూ రెండుదశలకు పూర్వం మన చిత్రాలు ఎంత సలక్షణంగా వుండేవని ఆశ్చర్యపోయారు. ఈ నటీనటులు తమ ముఖాలలో కనబరచిన భావప్రకటన అద్వితీయం. ఈనాడు ఎంతకీ ఎగరడమే తప్ప భావగర్భితమగు నటన మర్చిపోయారా అనిపిస్తుంది. జ్ఞానేశ్వర్ చెల్లెలు, నాలుగైదేళ్ళ బాల, యింట్లోబియ్యంలేవని అన్నలు చెప్పగా విని, తల్లితో 'అమ్మా నాకీపూట ఆకలి వేయటంలేదే' అన్నప్పుడు మనకడుపు తరుక్కుపోతుంది. ఎటువంటి నియమావళితో తమసంతానాన్ని సద్వర్తనులుగా పెంచారోకదా వెనకటి కాలంలో కొందరు అనిపిస్తుంది. అస్పృశ్యతా నివారణ గురించి నేడు మనము అనర్గళంగా మాట్లాడుతాం. కాని సన్యాసం స్వీకరించిన బ్రాహ్మణుడు, తన ఆశ్రమ ధర్మంతప్పి, భార్యతో సంసారం చేసిన తప్పిదానికిగాను సంఘబహిష్కృతుడవడమే కాకుండా అతను దేహాంతరగత ప్రాయశ్చిత్తం పొందినప్పటికి కూడా పిల్లలకు ఉపనయన యోగ్యత లేకపోయింది. ఒక జ్ఞానదేవుడు ఉదయించి, బాంధవుల కళ్ళు తెరిపించి తాంత్రికులకు బుద్ధిచెప్పేదాక జడమైపోయిన సంఘంలో చైతన్యం కలుగదు. జ్ఞానేశ్వర్ తెలుగు ప్రజలు ఘనంగా ఆదరించవలసిన చిత్రం.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జ గ తి' - జనవరి 1963

బద్ధకంగా ఉన్నప్పుడు ఒంటరిగా ఉండకు; ఒంటరిగా ఉన్నప్పుడు బద్ధకంగా ఉండకు. —టెన్నిసన్

ప్రేమతో అందరినీ జయించలేకపోవచ్చు. కాని, ప్రేమగల హృదయం సమస్తాన్నీ స్పష్టంగా చూడగలుగుతుంది. —హార్వేబ్లాక్

# వెన్నెల కెరటాలు

## మహాదేవీ వర్మ

విప్లవాత్మకమైన వ్యక్తిత్వం మహాదేవీ వర్మది, ఆమె వ్యక్తిగత జీవితం సాహసభరితమై నిరంతర క్రియాశీలమై కన్పడుతుంది. ఆమె బాల్యంనుండి స్త్రీజాతిని అణగద్రొక్కే సాంఘిక ఆచారాలను, కట్టుబాట్లను, సంకుచిత ధోరణులను ఎదిరించి పోరాడింది. మామగారికి ఆమె చదువుకోవడం ఇష్టంలేదు. అయినా చదివింది. భర్తకు ఆమె సాహిత్య వ్యాసంగం ఇష్టంలేదు, ఎదిరించింది, చివరకు విడిపోయింది. భౌద్ధ భిక్షుణిగా మారవలెనని సంకల్పించింది. కాని మహాత్ముని ఆదేశానుసారం స్త్రీ జాతిలో నవజాగృతిని తేవడానికి జీవితాన్ని అంకితం చేసింది. ఆమె వ్యాసాలు, సంస్మరణాత్మక రచనలు, ఇంటర్వ్యూలు చదివితే స్త్రీ జాతి అధికారాలయెడ ఆమె విప్లవాత్మక దృక్పథం బోధపడుతుంది. ఆమె స్వాతంత్ర్య ప్రయత్నం ఆమె వ్యక్తిత్వానికి మరిన్ని మెరుగులు దిద్దింది. ఆమె పండిత జవహర్‌లాల్ కుటుంబానికి, ఇందిరా గాంధీకి కూడ ఆప్తురాలు. అయినా ఇందిరాగాంధి ప్రధానమంత్రిగా ఎమర్జన్సీని విధించడం ఆమె హర్షించలేకపోయింది. వ్యతిరేకించి విమర్శించింది.... తనను కన్నీటితో నిండిన మేఘంగాను, నిరంతరం కాలే దీపశిఖగాను భావించుకొన్నది. ఈ భావన భారతీయ నారీస్వరూపాన్ని మన యెదుట నిలబెడుతుంది. మరి ఆ మేఘం ఎప్పుడూ కన్నీరే వర్షిస్తూ ఉంటుందా ? చెప్పలేము. దీపశిఖ తాను కాలి వెలుగులు విరజిమ్ముతూ ఉంటుంది. సందేహం లేదు.

— సంపాదకీయం
'స్రవంతి'

## అడివి బాపిరాజు

1921 స్వరాజ్యోద్యమంలో జైలుకు వెళ్ళారు. బందరు జాతీయ కళాశాలలో ప్రమోద కుమార ఛటర్జీ వద్ద చిత్రలేఖనం అభ్యసించి, ఆ తర్వాత మదరాసు లా కాలేజిలో బి.ఎల్. పట్టం పొంది కొద్దికాలం భీమవరంలో ప్లీడరుగా ఉన్నారు. 1935 నుంచి 1939 వరకు ఆంధ్రజాతీయ కళాశాలకు ప్రిన్సిపాలు. కొంతకాలం ఫిలిములలో ఆర్టు డైరెక్టరుగా వున్నారు. సాహిత్యంలోను, చిత్రకళలోను బాపిరాజుగారు సిద్ధహస్తులు. 'నారాయణరావు' నవల, తిక్కన సోమయాజి చిత్ర పటము రెండూ ఆంధ్ర యూనివర్సిటీవారి బహుమానాలు పొందాయి. హిమబిందు, గోనగన్నారెడ్డి, కోనంగి, తుఫాను,

జాజిమల్లి మొదలైన వీరి నవలలు; అంజలి, వింధ్యాచలం, తూలికా నృత్యం, హంపీ శిధిలాలు మొదలైన కథలు; తొలకరి, హారతి మున్నగు పాటల సంపుటాలు; దుక్కి టెద్దులు, ఉషాసుందరి, భోగీరలోయ ఇత్యాది రేడియో నాటికలు పండిత పామర రంజకాలు. ఖడ్గ తిక్కన, శబ్దబ్రహ్మ, శశికళ, మీరాబాయి మొదలైన ఎన్నో చిత్రాలను రచించి, అనేకమంది యువకులకు చిత్రకళను నేర్పిన కులపతి, 1952 సెప్టెంబరు 22న కీర్తిశేషులైనారు.

—పరిచయం
'శ్రీవాణి'

## పాతూరి నాగభూషణం

అనేకమంది మేధావులను, శాస్త్రవేత్తలను, సంఘసేవకులను సృష్టించిన తెనాలి తాలూకా, పెదపాలెం అనే గ్రామంలో ఎనభైఏళ్ళ క్రితం జన్మించారు. పెదపాలెం గ్రామంలో జాతీయతా భావం ప్రేరేపించిన కొందరు యువకులు 1926 లోనే మానవాభ్యుదయమే ధ్యేయంగా 'సేవా సంఘం' అనే స్వచ్ఛంద సంస్థను స్థాపించారు. పిదప ఇది 'సేవాశ్రమం' అయి, అనేక ప్రజాహిత కార్యక్రమాలను నిర్వహించింది. ఈ ఆశ్రమ కార్యకలాపాలలో అంటే, గ్రంథాలయ నిర్వహణ, ఖద్దరు ప్రచారం, ప్రకృతి వైద్యం, జాతీయ పాఠశాల హరిజన సేవలలో నాగభూషణంగారు, మెళ్ళచెర్వు వెంకటేశ్వర్లు, చెరువు శ్రీశైల మల్లిఖార్జునుడు ప్రముఖ పాత్ర వహించారు. వీరికి ఆదేశకులు ఆ గ్రామ పెద్ద పుతుంబాక సీతారామయ్యగారు. సేవాశ్రమ గ్రంథాలయం తదుపరి ఆర్యబాల సమాజంగా మారి సమీపాన గల 30 గ్రామాలకు గ్రంథాలయ సేవ చేసింది. అన్నిటి కంటే ఈ గ్రంథాలయం తరపున బకింగ్ హామ్ కాలువ మీద నిర్వహించిన గ్రంథాలయ సేవ చరిత్ర ప్రసిద్ధమైనది. ఈ సేవ నిర్వహించిన ఘనత నాగభూషణం గారికే దక్కుతుంది.

— వెలగా వెంకటప్పయ్య
'గాంధీక్షేత్రం'లో

---

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్ళలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్ళో 'జగతి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి – చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI - Monthly, 2, Kutchery Road, P. B. 2922, Madras-4

# మానవ ప్రగతి

## గంగానది

భారతీయులందరికి వారి వేష భాషలతో సంభందం లేకుండా గంగా నది అక్షయపాత్ర వంటిది. సుమారు 30 కోట్ల మంది ప్రజలు గంగానదిపై ఆధారపడి జీవిస్తున్నారని పరిశీలకుల అంచనా. గంగానదితీరంలోనే కొన్ని వేల ఇళ్లు, పాకలు, మురికివాడలు నిర్మించుకొని, గంగా జలాన్ని త్రాగుతూ, వారి బిడ్డా పాపలు పశువులను ఈ నది ఆధారంగానే పోషిస్తూ జీవిస్తూన్నారు. ఈ నదీ జలాలను ఆధారంగా చేసుకొనే వారి పంట పొలాలలో అనేక పంటలు, పశుగ్రాసాన్ని ఉత్పత్తి చేసుకొంటున్నారు. కోట్లాది మంది భారత ప్రజలకు జీవనయానం గంగా జలం. ఈ గంగానదే సుసంపన్నమైన పచ్చటి గంగానది డెలా ప్రాంతంలో వరి, గోధుమ, చెరకు, ప్రత్తి, జనుము, పొలాలు పండించడానికి కారణమైంది. అందువలన గంగానది ప్రయాణించే ఎనిమిది రాష్ట్రాలు, హిమాచల్ ప్రదేశ్, పంజాబ్, హర్యానా, ఉత్తరప్రదేశ్, రాజస్తాన్, మధ్యప్రదేశ్, బీహార్, పశ్చిమ బెంగాల్, కేంద్రపాలిత ప్రాంతమైన ఢిల్లీ వారందరికి గంగానది వెన్నెముక వంటిది. కాని ప్రస్తుతం గంగా నదీ జలాలు త్రాగటానికి కాని, మానవ ఉపయోగకరంగా గాని లేవు. అంతేకాక బాక్టీరియా, అంటు రోగాలకు గంగానది మూలమైపోయింది. ఎత్తుగా ఉన్న హిమాలయ పర్వత శ్రేణులవద్ద తప్ప మిగిలిన అన్ని చోట్ల గంగానదిలో పరిశుభ్రతకు చోటు లేకుండా పోయింది. మానవుల ఆరోగ్యానికి, పశువులకు, చేపల ఉనికికి జలాలు అపాయకారిగా ఉన్నాయి. భారతదేశ ఆధ్యాత్మిక కేంద్రంగా భావింపబడే కాశీ లేదా వారణాసి లేదా బెనారస్‌లోనే ఎక్కువగా గంగానది కాలుష్య మవటం విషాదకరం. ఇందు వలన గంగానది కాలుష్యం సమస్య హాని ఎంత తీవ్రతరమైందో, ఎన్ని కోట్ల మంది జీవనానికి ఈ కాలుష్యం హాని కల్గిస్తుందో అర్థం చేసుకొనవచ్చు. కాని ప్రపంచంలో ఏ నదీ పూర్తిగా పరిశుభ్రంగా లేదని ప్రకృతి శాస్త్ర వేత్తలు, పరిపాలన వేత్తలు, వృక్ష, జంతు, రసాయన, భూగోళ, భూగర్భ శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుతున్నారు.

గంగానది ఏస్థాయిలో కాలుష్యంగా ఉంది, అందులోని కాలుష్య పదార్ధాల రకాలు, పరిమాణం, ఈ కాలుష్య సమస్యకు మూలం. ఈ సమస్యను ఎదుర్కొనడానికి ఇందిరాగాంధీ కాలంలో గంగానదిపై ఒక సంక్షిప్త మైన అమలు చేయడానికి అనుగుణ మైన ఒక కార్యాచరణ పథకాన్ని రూపొందించారు. దీని ఫలితంగా, కేంద్ర ప్రభుత్వానికి చెందిన కేంద్ర కాలుష్య నియంత్రణ బోర్డు చాలా కాలం క్రితం గంగానదిపై అధ్యయ నం చేసి ఒక నివేదిక తయారు చేసింది. మురికి నీరు, చెత్తచెదారా లను నదిలోకి విసర్జింపకుండా నివా రించడం ద్వారా సుమారు 75 శాతం కాలుష్య పదార్ధాలను గంగానది నుండి తొలగించవచ్చని ఈ నివేదిక తెలియజేసింది. గంగానదీ తీరంలో ఉన్న 27 పెద్ద నగరాల నుండి నది లోనికి కాలుష్యం విడుదలను అరికట్ట డం ద్వారా, గంగానదిని నాశనం చేస్తున్న ఈ సమస్యను చాలావరకు పరిష్కరించవచ్చని కూడా నివేదికి తెలిపింది.

సముద్ర కెరటాల శక్తితో పనిచేసి ాణిజ్య సరళిలో విద్యుదుత్పాదన రపగల ఒక ఎలెక్ట్రికల్ జనరేటర్‌ను న్యూఫౌండ్‌లాండ్ దక్షిణ కోస్తా ప్రాంతంలో నెలకొల్పుతున్నారు. మోన్సాంటో కంపెనీకి చెందిన హెరాల్డ్ హెూఫ్ అనే అమెరికన్ శాస్త్ర వేత్త ఈ కొత్తరకం జనరేటర్‌ను కనిపెట్టారు. 20 లక్షల డాలర్ల ఖరీ దైన ఈ జనరేటర్‌లో 40 మీటర్ల పొడవుగల రెండు 'డిస్క్' లు వుం టాయి. వీటిలో ఒక 'డిస్క్' నీటి ఉప రితలంపైన తేలియాడుతుంటే మరొక 'డిస్క్' నాలుగు 'షాఫ్ట్'ల సహాయంతో సముద్రం ఉపరి తలానికి 20 మీటర్ల దిగువన నీటిలో వ్రేలాడు తుంది. నీటి ఉపరితలంపైన గల 'డిస్క్' సముద్ర కెరటాల తాకిడికి గురి కాగానే 'షాఫ్టు'లలోని 'పిస్టన్' పైకి కిందికి కదిలి 'హైడ్రాలిక్ ఫ్లూయిడ్'ని టర్బయిన్ల ద్వారా విరజిమ్ముతుంది. తద్వారా ఉత్పత్తి అయిన విద్యుచ్ఛక్తిసముద్ర గర్భంలో నెలకొల్పిన ఒక కేబుల్ ద్వారా ఒడ్డున గల విద్యుత్ నిల్వ కేంద్రాలకు చేరుతుంది. ఈ కొత్తరకం విద్యుదుత్పా దన ప్రక్రియను హెూఫర్ తొలుత ఒక చిన్న జనరేటర్ ద్వారా వెర్మాం ట్‌లో ప్రయోగాత్మకంగా పరీక్షించి చూశాడు. న్యూఫౌండ్‌లాండ్ లాంటి కొన్ని ప్రాంతాలలో విద్యుదుత్పాదనకు వినియోగిస్తున్న డీజెల్ జనరేటర్ల వల్ల జరిగే ఖర్చుకంటె ఈ కొత్త రకం జనరేటర్ వల్ల చాలా తక్కువ వ్యయ మవుతుందని ఆయన చెప్పారు.

## నౌకాదళం

బోర్డ్‌షిప్‌లలోని వివిధ యంత్ర పరికరాలు, ఎ.సి. ప్లాంట్లు, కంప్రెసర్లు, స్విచ్‌బోర్డులు, జనరేటర్లు, ప్రోపల్షన్

తదితర భాగాలను నిత్యం పర్యవేక్షించేందుకు అధిక మానవ శ్రమ శక్తిని వినియోగించుకోవడం జరుగుతున్నది. ప్రమాద నివారణ చర్యలు, వివిధ నిర్వహణ పనులకు వెచ్చించాల్సిన ఈ శ్రమ శక్తిలో అధిక భాగం ఇతరత్రా ఖర్చు కాకుండా చూడాలంటే కంప్యూటర్ల సేవలను వినియోగించుకోవడం సర్వత్రా హర్షదాయకం. ఇప్పుడొస్తున్న అధునాతన యుద్ధ నౌకలన్నీ అటోమెటిక్ వార్నింగ్, అలారమ్ సిస్టమ్స్ కల్గి ఉంటూన్నాయి. వరదలు, అగ్ని ప్రమాదాలను గురించి ముందుగానే కనిపెట్ట గల్గుతున్నాయి. రేడియేషన్ మానిటరింగ్ పరికరాలు, వైటల్ ఫైర్ ఫైటింగ్ అమరికలు ఉంటున్నాయి. డామేజి కంట్రోలు చర్యలను యన్. బి. సి. డి. ఆఫీసర్లు నిత్యం పర్యవేక్షిస్తుంటారు. వీటన్నింటిని కూడా కంప్యూటర్ల పరిధికి విడిచి పెట్టవచ్చు. ఇక డాక్యుమెంటేషన్ విషయానికొస్తే అతి తక్కువ ఉత్పాదకతతో గరిష్టస్థాయిన మానవ శ్రమ శక్తిని వినియోగించవలసి వస్తున్నది. ఈ పనులన్నిటిని కూడా కంప్యూటర్లు క్షణాలలో నిర్వహించగలవు. అందిన సమాచారాన్ని నిక్షిప్త పర్చుకొని తదనుగుణంగా పనులను చక్కబెట్టుకుపోగల నేర్పు కంప్యూటర్లకు ఉంది. కనుక ఈ విషయంలో కూడా కంప్యూటర్లని ఆశ్రయించడం ఉత్తమం. ఇలాచూసినపుడు షిప్‌మానేజిమెంటుకు సంబంధించిన ప్రతి పనిని కంప్యూటర్ల ద్వారా చేయించుకోవచ్చు. అలా చేయడం వల్ల ఉత్పాదకత పెరగడం, నిర్దిష్ట సమాచారానికి అనుగుణంగా ఎప్పటి పనులు అప్పుడు చక్కదిద్దుకు పోగల్గడమేకాక మిగతా పనులు చూసుకొనేందుకు మేనేజిమెంటుకు వెసులుబాటు చిక్కుతుంది. కంప్యూటర్ల ద్వారా చేకూరే ప్రయోజనాల ప్రాధాన్యతను నౌకాదళం గుర్తించింది. కనుకనే ఈనాడు మనం మన యుద్ధ నౌకలను ఇతరులకు తీసిపోలేని రీతిని నిర్వహించుకోగల్గుతున్నాము.

## పోస్టాఫీసు

బలమైన దుడుకర్రకు గజ్జెలు కట్టి, దాన్ని ఒక చేతిలో కదలిస్తూ భుజానికి బరువైన తపాలా సంచీ వేలాడతీసుకుని దృఢమైన వ్యక్తి పరువెత్తుచుండే దృశ్యం గ్రామీణ ప్రాంతాలలో ఇంకా నిన్న, మొన్నటిది లాగానే అనిపిస్తుంది. కొట్టాయంలోని ప్రధాన తపాలా కార్యాలయము నూరు సంవత్సరాలు పూర్తి చేసుకుంది. 1882 లో ఒక గుమాస్తా, ఇద్దరు తపాలా బంట్రోతులు, ఒక ఉపతపాలా అధికారితో చాలా చిన్న స్థాయిలో నిర్వహించబడుచుండేది. ఆ రోజుల్లో తపాలా పరుగెత్తే దృఢమైన వ్యక్తులచేత, దేశవాళీ పడవలమీాదా రవాణా చేయబడుతుండేది. ఆ జ్ఞాపకాల తీపిగురుతులుగా ఈనాటికీ కొట్టాయం పోస్టాఫీసులో దాచి ఉంచిన చిహ్నాలలో ఈకను సిరాలో ముంచి రాసిన వ్రాతప్రతులు, ఒక జాతీయ జండా మరికొన్ని వస్తువులు ఉన్నాయి. కొట్టాయంలోని ఈ తపాలా

కార్యాలయమును 1985 ఏప్రిల్ 1న ప్రధాన తపాలా కార్యాలయముగా మార్చి ఈ మధ్యనే భారత దేశంలోని మొదటి 'మోడల్' తపాలా కార్యాలయముగా ప్రభుత్వమువారు ప్రకటించారు. కేరళలోని రద్దీపోస్టాఫీసులలో ఒకటిగా ప్రతీరోజూ 10,000 ల మంది ప్రజల రాకపోకలతో, రూ. 20,000/- ల ఆదాయము నార్జించే స్థాయిలో ప్రస్తుతమున్నది. ఈ తపాలా కార్యాలయము నుండి 10 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణములో సగటున రోజుకు 25,000 ఉత్తరాలు బట్వాడా చేయబడుతున్నాయి. అంతకంటే ఎక్కువ మొత్తంలో సేకరణ కూడా జరుగుతున్నది. కేరళ రాష్ట్రం మొత్తం మీద ఈ కొట్టాయం తపాలా కార్యాలయం మాత్రమే ఏకైక ఆదర్శ తపాలా కార్యాలయం కాదు. మొత్తం ఇటువంటి ఆరు తపాలా కార్యాలయాలు పని చేస్తున్నాయి.

నమ్మక ద్రోహం కంటె ప్రత్యక్ష వైరం ఎంతో మంచిది — జాన్సన్

ఆదర్శమనేది లక్ష్యసిద్ధికి తప్ప మరింకే శాసనానికీ వొడబడదు. — థామస్ హార్డి

స్వభావంలో ఔన్నత్యం లేనప్పుడు, 'అవసరం' మనుషులని పాశవికులుగా చేసుంది. — హొరేస్




ముస్తాబులో మార్పు!





సరిక్రొత్త ఆకర్షణీయమైన సీసాలలో
లోధ్ర
బాధారహిత ప్రకృతి సిద్ధమయిన ఆరోగ్యమును స్త్రీలకు 80 సంవత్సరములుగా ఇచ్చుచున్నది.
ఉచిత వైద్య సలహాకు ఈ కూపనును పూర్తిచేసి మా జాబుతో పంపండి.
పేరు: ----------------------
విలాసము: ----------------------
----------------PIN--------
కేసరి
రాయపేట, మద్రాసు-14
ఏజెంట్లు:
సీతారాం జనరల్ స్టోర్స్ ఏజన్సీస్,
విజయవాడ - సికింద్రాబాద్

# కొత్త పుస్తకాలు

లీలా కృష్ణుడు - దశమస్కంధము. వ్యాఖ్యాత : ఇంద్రగంటి శ్రీకాంతశర్మ. రాజకమలం - 3.... ప్రచురణకర్త. ఖరిడేహాల్ వేంకటరావు, సింగపూర్. కాపీలకు: రాజాలక్ష్మి ఫౌండేషన్, 5 సెకండ్ క్రాస్ స్ట్రీట్, టి టి కె రోడ్, మద్రాసు – 600018.

'సుమారు 50 సంవత్సరములకు పూర్వము అనగా 1938లో మా పితామహులు, విద్యల నగరమైన విజయనగరంలో శ్రీ వేదవ్యాస ముద్రణాలయాధిపతులునైన స్వర్గీయ శ్రీ ఖరిడేహాల్ శ్రీనివాసరావు గారు ముద్రణాలయ రజతోత్సవ సందర్భంగా శ్రీమత్ భగవద్గీత 18 అధ్యాయములు శ్రీవిష్ణు సహస్రనామ సహితముగా అచ్చు వేయించి అందరకూ ఉచితముగా ఇచ్చియున్నారు.... మా పితామహుల అడుగుజాడలలో సంచరించిన మా తండ్రిగారు కీ. శే. ఖరిడేహాల్ వేంకట నరసింగరావుగారు శ్రీ వాయుస్తుతి ముద్రించి భక్తజనులందరికీ అందించియున్నారు..' - అంటున్నారు ప్రచురణకర్త వేంకటరావు. ఆ వరవడిలోనే తేట తెనుగున ఈ దశమస్కంధం.

"'హరి వంశ' కథనుభారత శేష భాగంగా చెబుతారు. భారతాన్ని తెలుగు చేస్తూ, నన్నయ్యభట్టు ఆది పర్వంలో, లెక్క చెపుతూ - హరివంశ, భవిష్యత్ పర్వాలతో కలిపి మూల భారతంలో మొత్తం నూరు పర్వాలున్నాయని చెప్పాడు.... భాగవతానికి వస్తే – ఇది రామాయణం, భారతాల లాగ ఇతిహాసం కాదు. పురాణం. పద్దెనిమిది మహా పురాణాలలో చాలా ప్రసిద్ధమైంది కూడ. సంస్కృత మూలం దశమస్కంధం ఒక్కటే, తొంభై అధ్యాయాలు. స్కంధాల లెక్కకు వస్తే మొత్తం పన్నెండున్నాయి.... పోతన్నగారు వ్రాసిన తెలుగు భాగవతం పూర్వోత్తరభాగాలు కలిపి మొత్తం పద్యాలూ వచనాలూ మూడువేల నూటఇరవై అయిదు.... ఈ రచనతో సంబంధం వున్న మరో ముగ్గురున్నారు - వెలిగందల నారయ్య, ఏర్చూరి సింగన్న, గంగన్న, పన్నెండు స్కంధాలలో కొంత భాగం పోవడం వల్ల ఈ ముగ్గురూ వేరు వేరు స్కంధాలలో కొంత కొంత పూర్తి చేస్తూ వచ్చారు..... సంస్కృతంలో భాగవతానికి అద్వైత పరంగా శ్రీధరాచార్యుడు, విశిష్టాద్వైత పరంగా వేంకట కృష్ణాచార్యుడు, ద్వైత పరంగా విజయధ్వజాచార్యుడు వ్రాసిన వ్యాఖ్యలు చాలా ప్రసిద్ధికి వచ్చాయి. పోతన్నగారు అద్వైత ప్రధానంగా కొనసాగిన

ధరాచార్యుడి వ్యాఖ్యను కూడా తమ ఆంధ్రీకరణంలో వాడుకున్నారు. సొంతంగా కొన్నిచోట్ల పెంచి, కుదించి, తెలుగు భాగవతానికి సౌరభం సమకూర్చారు,"— అని కృష్ణ కథ గురించి వివరించారు ఇంద్రకంటి శ్రీకాంత శర్మ.

దేవకీదేవి గర్భాన అష్టమ సంతానంగా జన్మించి వ్రేపల్లెలో నందుని యింట పెరగడం, పూతన, తృణావర్తుల సంహారం, 'కలయో, వైష్ణవ మాయయో....' అని చిన్ని కృష్ణుని నోరు చూసి యశోదాదేవి ఆశ్చర్యపోవటం, వ్రేపల్లె మంచిబృందావనానికి రావటం, అయిదేళ్ళ ప్రాయంలో అఘాసురుడిని చంపటం, కాళీయ మర్దన, గోపికా వస్త్రాపహరణం. గోగోప - గోపికా జన రక్షణ కోసం పదేళ్ళ వయసులో గోవర్ధనగిరి ఎత్తడం, 'నల్లనివాడు పద్మనయనంబుల వాడు' అంటూ గోపికలతని వెంటబడటం, వృషభాసురుని మరణం, అక్రూర సందేశం, బలరామ కృష్ణుల మధురా నగర ప్రవేశం. చాణూర ముష్టికులని మట్టుపెట్టడం, కంసవధ, ఉగ్రసేనునికి పట్టాభిషేకం, సాందీపనివద్దఅరవై నాలుగు విద్యలూ అరవై నాలుగు రోజులలో నేర్చుకోవటం, ఉద్ధవనీతి, కుబ్జకథ, కాలయవనుని పరిమార్చడం. రుక్మిణీ కళ్యాణం, ద్వారకానగర నిర్మాణం, స్యమంతకమణి, నరకాసుర వధ, సుభద్రా కళ్యాణం, ఉషా అనిరుద్ధుల వివాహం. పౌండ్రక వాసుదేవుడు, బలరామకృష్ణుల యోగమాయాబలం - ఈ కథలన్నీ తెలిసినవే అయినప్పటికీ మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తాయి. కంస వధ నాటికి కృష్ణునికి పట్టున పదేళ్ళుకూడా లేవు - అప్పటి కప్పుడే రాసలీల. బృందావనం అదంనా అయిపోయింది. అయితే ఇక్కడ ఒక్క విషయం మనం మర్చిపోకూడదు. కృష్ణుడు మొదట్నుంచీ చివరిదాకా లీలా మానుష విగ్రహధారి. మనుష్యుల మధ్య వుంటూనే, మనిషిలా నడుచుకుంటూనే, మానవాతీతుడైన మూర్తి. 'హరి యను రెండక్షరములు హరియించును పాతకములు అంబుజనాభా' అని వెయ్యేళ్ళుగా హిందువుల మనసుల్లో నాటుకుపోయిన సౌందర్య దీపం కృష్ణ శబ్దం. (ఈ పుస్తకం చదవాలనుకున్న వారు రాజాలక్ష్మి ఫౌండేషన్‌కి రాసి ఉచితంగా తెప్పించుకోవచ్చు.)

——క్షీరసాగరమ్

## —ఈ మధ్య అందినవి

సాక్ష్యం — మానవాళి సమక్షంలో. ఎస్సెమ్ ఖాద్రి. తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్ - 2 .... రు 3-00

శేషేంద్ర చమత్కారికలు. చైతన్య కవితా వేదిక. బెంగుళూరు - 56.... రు 5-00

తెలుగు యోగులు - మేడపాటి వెంకటరెడ్డి.... వేమన యోగ పరిశోధనాలయం, సికింద్రాబాదు - 3 .... రు 26-00

విప్లవ భాషా విధాత — శేషేంద్ర రచనలపై సమీక్షా వ్యాసాలు, సాహితీ మంజరి, ఒంగోలు ....రు 15-00

ప్రసార తరంగిణి. కూర్పు: పన్నాల సుబ్రహ్మణ్య భట్టు. సామాన్య ప్రచురణలు, పిఠాపురం.... రు 25 - 00

శ్రీ ఆంజనేయ చత్వారింశత - హనుమాన్ చాలీసాకు తెలుగు. పప్పు విశాలాక్షి. శ్రీ ఆంజనేయ దేవస్థానం, బలుసులపాలెం.... రు 5 - 00

ప్రేమ కోసం - భూమి కోసం - యషార్ కెమాల్ మూలం - కొండేపూడి లక్ష్మీ నారాయణ స్వేచ్ఛాను వాదం - రు 10 - 00; వైతాళికులు - ముద్దు కృష్ణ సంకలనం - రు 17 - 00; ఋగ్వేద ఆర్యులు - రాహుల్ సాంకృత్యాయన్ మూలం - మిక్కిలినేని సుబ్బారావు అనువాదం- రు 20 - 00 ; తాపీ ధర్మారావు జీవిత సంగ్రహం - తాపీ మోహనరావు రచన.... రు 6- 00 .... పై నాలుగు పుస్తకాలు ప్రచురించినవారు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుజ్, విజ్ఞాన భవన్, 4 - 1 - 430 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. బ్రాంచీలు: విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం, తిరుపతి, హనుమకొండ, గుంటూరు, కాకినాడ

Mahabharata Katha Manjari. Telugu Original : Chilakamarthi Lakshmi Narasimham, English Translation: M. S. Ramesh Published by Sri Ramakrishna Samiti, Gandhinagar, Vijaya - wada - 520003 - Rs. 6 - 00

ఆధునిక మహా భారతము - శేషేంద్ర కృతి, శేషేంద్ర సాహిత్య పీఠము. హైదరాబాదు.... రు 20 -00

బ్రౌను - తెలుగు కావ్య సముద్ధరణము. డా॥ ఆర్. పద్మావతి. నవ్య పరిశోధన ప్రచురణలు, తిరుపతి. ప్రతులకు: జి లక్ష్మమ్మ, 18 - 1 - 699 భవానీ నగర్, తిరుపతి.... రు 50-00

రమ్‌జాన్ శుభాలు మహమ్మద్ తఖీయుద్దీన్. ప్రచురణ: మజ్లిస్ ఇషాలతె ఇస్లాం, హైదరాబాదు— 659.... రు 3 - 00

కళాసాగర్ - 15 వ వార్షికోత్సవ సంచిక - 1987.... 5, త్యాగరాయ రోడ్, మద్రాసు - 17.... కళాసాగర్ సభ్యులకు మాత్రమే

అందుకున్న పుస్తకాలన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలో వెలువడుతాయి.





మనకి మనం మనమెంత మంచి వాళ్ల మనుకుంటున్నామో, ఆవిధంగా ఇతరులు వుండాలని ఆశించటమే మనం చేసే పెద్ద పొరబాటు. —థేకరీ

మనం పథకాలు వేస్తూ వుండగా, మనకి సంభవించేదే జీవితం

—సాండర్స్

వెనుకటి తప్పులు మళ్లీ చేయడం గాక, కొత్త తప్పులు చేయటాన్ని 'అనుభవం' అంటారు. —ఈనోస్



## సుప్రీమ్ వక్కలు



## సుప్రీమ్ సుగంధ ద్రవ్యాలు



## సుప్రీమ్ ఫార్ములా

మేలు రకమైన పీట వక్కలు విలువైన యాలుక్కాయలు, లవంగాలు, జాజికాయ, జాపత్రి మెండాలు పచ్చ కర్పూరం మొదలైన సుగంధ ద్రవ్యాలు, వక్కపొడి తయారీలో మాకున్న అనుభవం. మీకు అత్యుత్తమమైన వక్కపొడి అందించాలనే మా 30 సంవత్సరముల అహర్నిశ కృషి. అన్నిటికి మించిన మీ అభిమానం, వీటి అన్నిటి కలయికల ఫలితమే.

# క్రేన్

## వక్కపొడి
## సుప్రీమ్ క్వాలిటి

దేనికి సాటి మరొకటి లేదు.




TARA-CBNP-788

## 1987 సెప్టెంబరు 27 . . . . 28

మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్ 36వ వార్షికోత్సవం మ్యూజిక్ అకాడమీలో రమణన్, ఉమారమణన్‌ల ఫిలిమ్ సాంగ్స్‌తో ప్రారంభమయింది. అధ్యక్షత వహించిన కేంద్ర మంత్రి చిదంబరం, ఫిలిమ్‌ఫాన్స్ వారి ఉత్తమ కృషిని ప్రశంసించారు. ముఖ్య అతిధి హేమామాలిని తను లోగడ వీరి యవార్డ్ అందుకున్నాననీ, ఉత్తమాభిరుచుల నిర్ణయంలో ఈ అసోసియేషన్‌కి ప్రత్యేక స్థానం వున్నదనీ అన్నారు. ముప్ఫయియ్యేళ్ల క్రితం 'లా కాలేజీ'లో తన స్టూడెంటయిన చిదంబరం ఈనాడు కేంద్ర మంత్రిగా పాలకవర్గమూ ప్రజలూ మెచ్చుకొనేటట్లు వ్యవహరించడం తన కెంతో సంతోషంగా వున్నదనీ, అటువంటి వ్యక్తి ఈ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించడం మరింత హర్షదాయకమనీ అన్నారు స్వాగతం తెలిపిన జస్టిస్ మోహన్· కార్యదర్శి కన్నన్ అన్నిటా తామై వుండగా, యిరువురు సినీ సుందరీమణులు — రాధిక, రేవతి — బహుమతి ప్రదానోత్సవం నిర్వహించారు. (గ్రహీతల వివరాలు : 'జగతి' — 374 ; 'డైరీ' — 1987 జూన్ 20)

శోభన్‌బాబు, రాధిక ఏకోదరులుగా నటిస్తున్న పద్మావతీ ఫిలింస్ డివిజన్ వారి చిత్రం పేరు : 'అన్నా చెల్లెలు', శరత్‌బాబు, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, ప్రసాద్‌బాబు, జివిజి మున్నగువారున్నారు. దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి నవంబరు నెలాఖరుకి విడుదల చేదామనుకుంటున్నామని చెప్పారు నిర్మాత సుబ్బారావు పత్రికా గోష్ఠిలో.. పి ఆర్ ఒ : అంజనేయులు.

## 1987 అక్టోబరు 02

పి విజయకుమార్, పి రమేష్ నిర్మాతలుగా తేజా ఆర్ట్ మూవీస్ వారి 'శ్రీ కనకమహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్' అనే చిత్రం, వంశీ దర్శకత్వంలో, నరేష్, మాధవి హీరో హీరోయినులుగా, నవంబరు పదిహేను నుంచి రాజమండ్రి, రాజోలు పరిసరాలలో ఒకే ఒక్క షెడ్యూలులో పూర్తవుతుంది. ఇందులో ఏడు పాటలు వుంటాయి, - వాటిలో మూడు పాత వరసలు, కామిడీకి ఎంతో అవకాశం గల కథ-అన్నారు దర్శకులు వంశీ ఈ నాటి పత్రిక గోష్ఠిలో. ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్; వేమూరి సత్యనారాయణ... పి ఆర్ ఒ: కౌండిన్య.

. . . . . 05

"ఈ రోజుల్లో నిజమైన శతదినోత్సవాలు చాలా అరుదుగా జరుగుతున్నాయి — వివిధ థియేటర్లలో, మధ్యాహ్నం ఆటలతో లాగించి, 'వంద రోజులు' అనిపించుకున్నవే అధికం. గడిచిన పదిపన్నెండు నెలలలో నిజంగా నూరు రోజులు ఆడినవి నాలుగైదు చిత్రాలు మాత్రమే. వ్యాపార దృష్ట్యా ఈ శతదినోత్సవాలు జరుపుతున్నారు. 'పన్నెండు కేంద్రాలలో' అంటున్న ఈ పిక్చరు కూడా, నూరు రోజులు వరసగా ఒక థియేటర్‌లో ఆడినది రెండు చోట్ల మాత్రమే -మిగతా ఊళ్లలో వేర్వేరు థియేటర్లలో ఆడగా, నూరు రోజులు పూర్తి చేశారు. రాజకీయ చిత్రమనగానే విమర్శలకి గురికాక తప్పదు. అయితే యిది ఒక ఆశయంతో, ఒక ప్రబోధంతో, ఒక లక్ష్యంతో తీసిన చిత్రమని చెప్పక తప్పదు.... నా శిష్యుడైన ధవళ సత్యం పడ్డ శ్రమ ఫలించింది. ఆర్థికంగా పిక్చర్‌కి లాభాలు రాకపోయినా, అందరూ మెచ్చుకున్నారు'' – అన్నారు దాసరి నారాయణరావు, వుడ్‌లాండ్స్‌లో జరిగిన రాధామిత్ర మండలి వారి 'చైతన్య రథం' శతదినోత్సవ సభలో.... "సింగపూరులో వుండగా తమ్ముని (దాసరి) వద్ద నుంచి టెలిఫోన్ వచ్చింది ; వొప్పుకున్నాను, ఈ నిర్మాతలు (వంగవీటి మోహనరంగా) మా జాతివారే - అంటే, కాంగ్రెస్ ! 'చైతన్య రథం' పేరు ఎంతో చక్కగా ఉంది'' – అన్నారు ముఖ్య అతిథిగా విచ్చేసిన శివాజీ గణేశన్ తెలుగులో మాట్లాడుతూ. నిర్మాత వంగవీటి రత్న కుమారికి, దర్శకులు ధవళ సత్యానికి ఆయనే జ్ఞాపికలు అందజేశారు. నిర్మాత డూండీ, జయసుధ, షావుకార్ జానకి, యమ్మెస్ రెడ్డి, గుమ్మడి, కాగడా శర్మ ఆయా కళాకారులకు సాంకేతిక నిపుణులకు జ్ఞాపికలు అందజేశారు. కళాకారులు తనతో ఏవిధంగా సహకరించి చిత్రంలోని ఉన్నత ప్రమాణాలకు తోడ్పడినదీ చెప్పారు దర్శకులు ధవళ సత్యం. "మాకు అర్థబలం లేదు - అంగబలం ఉంది. రాధామిత్ర మండలికి గల అంగబలం వల్లనే ఈ పిక్చర్ నిర్మించడం సాధ్యమయింది. అర్భకులను, ఆర్తులను ఆదుకోవడమే మా మిత్ర మండలి లక్ష్యం. సమాజంలోని దుర్నీతినీ, దౌష్ట్యాన్నీ ప్రతిఘటించడమే మా ధ్యేయం. ప్రజలలో చైతన్యం తెచ్చేందుకు సినీమాడియమ్ ఎంతవరకూ ఉపయోగబడగలదనే తప్ప, ధన సంపాదన కోసం మేము యిందులోకి రాలేదు. సంవత్సరానికొక్కటి చైతన్యవంతమగు చిత్రం, నిర్మించాలని మా సంకల్పం'' - అన్నారు వంగవీటి మోహనరంగా, వంద నమస్కారణ గావిస్తూ !

. . . . 08

సినిమాలు వచ్చి నాటకాన్ని వెనక్కి నెట్టాయి ; ఫోటోగ్రాఫీతో చిత్రకళ వెనక్కి వెళ్ళింది. పోతే, పదిహేనూ ఇరవై లక్షలమంది చూస్తేగాని సినిమా నిలబడదు; అయిదారు వందలు చూసి

మెచ్చుకుంటే, నాటకానికి పునః ప్రదర్శనావకాశం కలుగుతుంది. అలాగే ఫోటోగ్రఫీలో కనిపించేది ఛాయాచిత్రమే - అందులో భావం ఉండదు. అమెరికన్ సెంటర్లో యివ్వాళ విన్‌స్లో హోమర్ (Winslow Homer - The Nature of the Artist - 30 m) ఆంద్రు విత్ (Andrew Wyeth - The Wyeth Phenomenon - 27m) రెండు చిత్రాలు ఆహ్వానితులకు చూపారు.... 19వ శతాబ్ది మెయినీ రాష్ట్ర సముద్ర తీరంలోని జాలరి వాడలను విన్‌స్లో హోమర్, వాటర్ కలర్స్‌లో అతి మనోజ్ఞంగా చిత్రించాడు. ప్రకృతికీ ప్రాణికీ మధ్య నుండే అవినాభావ సంబంధాన్ని ఆ రంగులు అనువదించి చెబుతాయి. (స్మిత్ సోనియన్ వారి ఫిలిమ్).... పెన్సిల్వేనియా రాష్ట్రానికి చెందిన ఆంద్రు విత్ చిత్రకారుల కుటుంబంలో పుట్టాడు; తండ్రీ, తను, తన కుమారుడు ముగ్గురూ చిత్రకారులే! చిత్ర రచనా శిక్షణను తండ్రి వద్దనుంచి పొందాడు ఆంద్రు విత్. 'కుంచెలో రాబర్ట్ ఫ్రాస్ట్ అంతటివాడు' అని 1963 నాటికే గుర్తింపు పొందిన విత్ గురించి, ఆయన సోదరి, కుమారుడు, విమర్శకుడు జాన్ కానడె (John Canaday) ముగ్గురూ మూడుకోణాల నుంచి, ఆచిత్రకారుని భావాంచల విహారం గురించి, విధానం గురించి చెబుతారు. 'మెడల్ ఆఫ్ ఫ్రీడమ్' పొందిన ఈ అమెరికన్ చిత్రకారుని 1977లో ఫ్రెంచి అకా



వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్పరాగ, మరకత, మాణిక్య, ప్రవాళ ముత్యములను నవరత్నాలన్నారు - అపురూపంగా లభించేవి గనక. ఈనాటి పరిశ్రమల కోసం ఉత్పత్తి అయ్యే వజ్రాలు (సింథటిక్ జెమ్స్) వీటికంటె విశిష్టమైనవని నిపుణుల అభిప్రాయం.

3

డమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ గౌరవిస్తుంది. తమ అకాడమీ సభ్యునిగా చేస్తుంది; 1978లో సోవియట్ అకాడమీ తమ గౌరవ సభ్యునిగా చేర్చుకుంటుంది; 1930లో బ్రిటిష్ రాయల్ అకాడమీ అదేవిధంగా గౌరవిస్తుంది. ఆంద్రు విత్ చిత్రాలు జీవ స్పందనతో, భావార్థ సంకేతాలతో మనసుని ఆకట్టుకుంటూ ఆలోచింపజేసేవిగా ఉంటాయి.... మంచివి మనకి సన్నిహితులైన వారితో పంచుకోవాలనిపించడం సహజం గనక, కళలపట్ల అభిమానం

గల మిత్రులు ప్రేమ్‌చంద్‌తో చూశాను మొత్తం 57 నిముషాలు ఈ రెండు పిక్చర్లూ.

.... 10

మోహినీ రుక్మాంగద, భీష్మ తర్వాత వచ్చిన చిత్రాలలోని పాటల పరిచయంతో (విఎకె రంగారావు), తాపీ ధర్మారావు శతజయింతి ఉత్సవం, యమ్మెస్‌రెడ్డి అధ్యక్షతను, ఫిలిమ్ ఛాంబర్ ఆడిటోరియమ్‌లో జరిగింది. అధ్యక్షులు తమ కవితా పుష్పాలు చల్లి, ప్రారంభకులైన కెయస్ ప్రకాశరావు ప్రసంగ వ్యాసం చదివారు. తాతాజీతో తనకు గల పరిచయాన్ని, ఆయా సందర్భాలని చక్కగా వివరించారు కెయస్ ప్రకాశరావు. అలాగే సెట్టి ఈశ్వరరావు ప్రసంగ వ్యాసాన్ని మల్లిక్ చదివారు. వక్తలలో జగ్గయ్య, నరసరాజు రాలేదు. ఈ ఉత్సవ సంఘ సభ్యులుగా ఆహ్వాన పత్రంలో పేర్లున్న ముప్ఫయ్యొక్కరిలో సగం మంది ఈ శతజయంతి సభకు రాలేదు. శ్రోతల ఓపికకు పరీక్ష పెట్టవద్దు - అని అధ్యక్షులు హెచ్చరిస్తున్నప్పటికీ, వక్తలు ఈ ఒక్క విషయమంటూ పొడిగిస్తూ వచ్చారు. ఏడున్నరకి సభ ముగుస్తుందనుకొన్నారు; కాని, ఎనిమిది దాటినా యింకా పసంగాలు జరుగుతూనే వున్నాయి. ఆచార్య రామచంద్ర, ఇంటూరి వెంకటేశ్వరరావు, కాకరాల, తాపీ మోహనరావు, మనసత్యం మున్నగువారు.... కోశాధికారి హరిప్రసాద్‌రెడ్డి వేదికమీద నున్నవారిని పుష్పమాలా లంకృతులు గావించగా, కార్యదర్శి కృష్ణమూర్తి పరిచయ వాక్యాలు చెప్పారు. కృష్ణమూర్తి, మల్లిక్ యిరువురూ యిది అభ్యుదయ రచయితల సంఘం ఆర్గనైజ్ చేసిన వేదికగా పేర్కొన్నారు.... 'మా నాన్నగారు బ్రాహ్మణ ద్వేషి - అనే అపోహ ఉంది' - అన్నారు తాపీ మోహనరావు. 'బాబూ' అని ఎంతో ఆప్యాయతతో పల్కరించే ఆయన కంఠంలోగాని, ఆయన కవితా హృదయంలో గాని దయార్ద్రతకీ మంచి మనసుకీ ప్రాధాన్యమిచ్చిన ఆయన స్వభావంలోగాని ద్వేషమనే దానికి కించిత్తుకూడా అవకాశం లేదు. ఆయన విశ్వమానవతావాది; నిరంతర పథికుడు; ప్రశ్న లేనిదే ప్రగతి లేదన్న అన్వేషి; మహాపండితుడు, గొప్పకవి, సినీ మీడియమ్‌లో 'సంభాషణ' కు గల స్థానం తెలిపిన మార్గదర్శి, సహృదయుడు, అభ్యుదయ మార్గాన పయనించిన పత్రికా సంపాదకుడు. తెలుగు పాఠకుల ఆలోచనా పద్ధతులను కొంతమేర మార్చగలిగిన భావసంస్కారి.... 'దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు?' వంటివి ఆయన పరిశోధించి వ్రాసినవి కాదు. ఆయన సోషాలజిస్టూ, యాంత్రోపాలజిస్టూ కాదు. ఆంగ్లంలో గ్రంథస్థమై వున్నవాటిని తెలుగు పాఠకులకు తెలిసే రీతిలో చెప్పారు. ఆలోచనా పద్ధతిలోని బూజులు దులపమన్నారు. పాతికేళ్లకు పైగా గ్రాంధిక

వాదం సమర్థించిన తాపీ ధర్మారావు. పిఠాపురంరాజా పీపుల్స్‌పార్టీ తరఫున (1937) పత్రిక పెట్టినప్పుడు ప్రజల మధ్యకు వెళ్లగల భాష గురించి పున రాలోచన చేసుకోవలసి వచ్చి వుం టుంది. రాజకీయంగా ఆయన కాంగ్రెస్ వాది కాదు - ఆ కారణంగా కూడా ఆయనపై కొన్ని అభాండాలు పడ్డాయి. సినీ ప్రపంచంతో సతమతమవుతున్న ప్పటికీ, ఆయన పత్రికా రచనను విడనాడలేదు - అది ఆయన ఊపిరి. తెలుగు భాషపై, భావోద్దీపనాయుత మగు తెలుగు వచనంపై ఆయన కున్నంతటి అధికారం మరింకెవరికీ లేదని చెప్పడంలో అతిశయోక్తి లేదు.... (తాపీ ధర్మారావు 1972 జులై నెల 'జగతి' ముఖచిత్రం. వ్రాసినది : 'టాగూర్‌నీ టాల్‌స్టాయినీ గుర్తుకి తెచ్చే ఈ తెలుగు కవి చంద్రుని, విజయ విలాస వ్యాఖ్యతో, కేంద్ర సాహిత్య అకాడమీ ఈ మధ్య గౌరవించిందిగాని తాతా జీగా ఆయన ఎందరికో ప్రేమా స్పదులు. మార్దవంగా పల్కరించే ఆయన కంఠంలో విశ్వమానవగీతిక వినిపిస్తుంది. మాలపిల్ల, రైతుబిడ్డ, రోజులు మారాయి - యిలా అనేక చిత్రాలకు వ్రాసి, సారస్వతోపాసనతో గడుపుతున్న 84 ఏళ్ల తాపీ ధర్మా రావుగారు తెలుగు జాతి రత్నాలలో ఒకరు.... 'జగతి' - జులై, 1972)

. . . . . 12

59 రోజుల షూటింగ్‌తో పూర్తయిన 'కిరాయి దాదా'లో కథానాయకుడు నాగార్జున్ - దర్శకత్వం కోదండ రామిరెడ్డి. హిందీ చిత్రం 'జాల్' ఆధారంగా తెలుగులో రూపొందిన ఈ చిత్రంలో నాయిక అమల. రావు గోపాలరావు, గొల్లపూడి, మాడా మున్నగువారున్నారు ; అతిధులుగా కృష్ణంరాజు, మురళీమోహన్ కనిపి స్తారు. మాటలు సత్యానంద్, నిర్మాత దొరస్వామిరెడ్డి. ఈ సాయింత్రం వారి ఆఫీసులు జరిగిన పత్రికా గోష్ఠి సందర్భంగా, మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ బిల్డింగ్



1054 లో ఖగోళ శాస్త్రవేత్తలు, కోటి సూర్య ప్రభాసమైన ఒక మహో జ్వలమైన తారకని - ఆకాశ మార్గాన మతాబులూ తారాజువ్వలూ వెదజల్లిన తారకని - పట్టపగలు చూశారట. అటువంటి వింత యింతదాకా మళ్లీ జరగలేదు, వైజ్ఞానిక పరిభాషలో దాని పేరు సూపర్‌నోవా.

---

ఫండ్‌కి రెండువేల అయిదువందలు విరాళమిచ్చారు.

. . . . . 14

మూడు నెలల క్రితం ఫోనులో చెప్పారు - శాస్త్రీగారు : "డైరీలో రాసుకోండి - పధ్నాలుగో తేదీ రాత్రి 'తమిళనాడు'లో మీరు, రావి కొండల్రావు, పద్మనాభరావు, జయాశేఖర్, దత్తు, ఆనంద్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరుతున్నారు - కృష్ణమూర్తి మీతో వచ్చేవారందరికీ గ్రూప్ లీడర్. ఒక బాచ్ అంతకి క్రితం రోజు జిటిలోను, మరొక బాచ్ అదేరోజు జిటిలోను వెళ్తోంది. అక్టోబరు పధ్నాలుగు బుధవారం కదా, బుధవారం రాత్రి లక్ష్మివారం రాత్రి ట్రయిన్‌లో నిద్ర. శుక్రవారం తెల్లవారేసరికి ఢిల్లీ - శుక్రవారం సాయంత్రం అయిదున్నర నుంచి శనివారం సాయంత్రం నాలుగు నుంచి, ఆదివారం మధ్యాహ్నం రెండు గంటల నుంచి మన ఫంక్షన్స్. సోమవారం సైట్ సీయింగ్. సోమవారం రాత్రి మళ్లీ మూడు బాచ్‌లుగా జిటిలోను, తమిళనాడులోను – బాక్ హూమ్ ఇన్ టైమ్ ఫర్ దీపావళి ఫెస్టివల్ ! మనకి అక్టోబరు 22 – లక్ష్మివారం దీపావళి పండుగ; కాని, యిక్కడ మద్రాసులో బుధవారం నరకచతుర్దశి పెద్ద పండగ. ఏమయితేనేం, మీ బాచ్ అంతా బుధవారం ఉదయానికి తమిళనాడులో మద్రాసు చేరుకుంటారు" .... ఏడెనిమిది వారాల క్రితం, "ట్రయిన్ బుకింగ్స్, రానుపోను, అన్నీ కన్ఫర్మ్ అయిపోయాయి - మీ బెర్తు నెంబరు S - 2 పద్దెనిమిది. టిఫినులు, కాఫీ టీలు, వంటలు యివన్నీ 'టాల్కొటారా' లోనే. వెనక భాగాన షామియానా వేయించి చేయిస్తున్నాం. జమ్‌షెడ్‌పూర్, భిలయ్ వచ్చిన ట్రిప్లికేన్ కుక్సే! టిఫినూ భోజనం సమృద్ధిగా ఉంటుంది - మనవాళ్లు ఎన్నిసార్లు కావాలన్నా కాఫీ, టీలకు కొదవ ఉండదు. ఈ కుకింగ్ యరేంజిమెంట్స్ ముప్ఫయి వేలకి తక్కువ కాదు - నలభై వేలు దాటకూడదని బడ్జెట్. ఢిల్లీలో యిడ్లీ సాంబార్, పొంగల్, రసమ్, తైరుసాదమ్ - యిలాటివి యింత మందికి - నూట యిరవైకి పైమాట - ఎక్కడ దొరుకుతాయి ? ఇవి లేకపోతే మనవాళ్లకి అన్నం తిన్నట్లు వుండదాయె. తిండి లేకుండా మాడ్చామనే చెడ్డపేరు మనకి రాకూడదు" - అన్నారు శాస్త్రిగారు టెలిఫోన్‌లో.... మా మధ్య తీగెల సంభాషణ సాధారణంగా రాత్రి టివిలో యింగ్లీషు న్యూస్ అయాక! పదకొండో తేదీ మధ్యాహ్నం ఫోనులో చెప్పారు : "రేపు నేను ఢిల్లీ వెళ్తున్నాను - కనీసం రెండు రోజుల ముందైనా అక్కడ వుండాలి కదా – పదహారో తేదీ ఉదయం మీ అందరినీ ఢిల్లీలో కలుసుకుంటాను"... ఇది భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీవారి పదకొండవ సాంస్కృతిక యాత్ర. సంగీత నృత్యాదులలోను భక్తి గీతాలలోను వుండే భావదీప్తి, ఆ రససిద్ధి, దేశసమైక్యతకు దోహదం చేయాలనే సంకల్పంతో పాటుపడు.

తున్న కల్చరల్ ఆర్గనైజేషన్ యిది. అధ్యక్షులు మాజీ ఉపరాష్ట్రపతి జెట్టీ: చీఫ్ కన్వీనర్ : టివికె శాస్త్రి .... సెంట్రల్‌లో సామాను తలపై పెట్టుకుంటున్న పోర్టర్, 'తమిళనాడు తొమ్మిదింపావుకి కదా, యింత తొందరగా వచ్చారేం, సార్ - ఏడున్నరేగా అయింది' - అన్నాడు. 'బిసిఐసి' వారు (భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ) పంపిన కవరుపై రిపోర్టింగ్ టైమ్ ఎనిమిదీ పదిహేను అని ఉంది. దూరప్రయాణం గనక అందరూ ఒక గంట ముందుగా రావడం మంచిదనే ఉద్దేశ్యంతో అలా టైప్ చేసి వుంటారని స్టేషన్‌కి వచ్చాకగాని తట్టలేదు. నా కంటె ముందుగా వచ్చివున్నారు. 'ఆంధ్రప్రభ' దత్తు ఫామిలీ. 'అంకుల్ మీరు మా దగ్గిరే కూచోవాలి. మొత్తం ఆరుగురం గనక మనవైపు యింకెవరూ రారు' అన్నారు - దత్తుగారి అమ్మాయిలు. వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు ఆఅమ్మాయిలిద్దరూ ఈ అంకుల్ విషయంలో ఎంతోశ్రద్ధ తీసుకున్నారు. అందులో ఒకమ్మాయి మా శారదాంబ పనిజేసే చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు స్టూడెంట్ .... తొమ్మిదింపావుకి రైలు కదిలింది - పదిగంటల దాకా పరస్పర పరిచయాలు. ఒక పద్మనాభరావుని గాని, ఒక జయాశేఖర్‌నిగాని మళ్లీ యిటువంటి ప్రయాణమప్పుడే కలుసుకోవడం! 'భిలయ్ నుంచి నాగపూర్, మీరైదుగురూ ఆ రాత్రివేళఎలా చేరుకున్నదీ, మీ నెరేషన్ 'జగతి' చదివిన మీదటగాని నాకు తెలియ లేదు'' -



ఇది అంతరిక్ష యాత్రల కాలమైనప్పటికి బెలూన్ ప్రయోగాలు జరుగుతూనే వున్నాయి. ఏడెనిమిదేళ్ళ క్రితం అమెరికాలో ఏభై అంతస్థుల మేడ అంతటి బెలూన్‌ని, ఆకాశంలోకి పంపించారు. అది 22 మైళ్ళ ఎత్తుకి వెళ్ళాక, దిగడం ప్రారంభించింది.

అన్నారు పద్మనాభరావు భార్య. చాలా మందికి మల్లే తెలుగు పత్రికలు ఆయన చదవరు గాని ఆమె చదువుతారు. బాంకింగ్‌కీ గార్డెనింగ్‌కీ అంకితమైన పద్మనాభరావు, స్టేట్‌బాంక్ మేనేజరుగా రిటైరయారు; బిసి ఐసి ప్రోగ్రామ్ కంపీరర్స్‌లో రెండోవారు: జయాశేఖర్. ఆమె గురించి వెనకొకసారి చెప్పాను.

..... 16

నేటి సూపర్ ఫాస్ట్ ట్రయిన్స్‌లో స్నానానికి అవకాశం ఉండదు తప్ప,

ఉదయం ఆరుగంటల కాఫీ నుంచి, టైముప్రకారం టిఫిన్లూ, వేడివేడి భోజనాలు, స్నాక్సూ, టీలు, కూల్ డ్రింకులు, మధ్యాహ్నం నిద్రకీ రాత్రి నిద్రకీ ఎటువంటి లోటూ ఉండదు. వీల్స్ మీద వున్నామన్న మాటేగాని కంపల్‌సరీ రెస్టూ, కబుర్లూ, ఆరున్నరకి న్యూఢిల్లీ చేరుతుంది గనక అయిదున్నరకే కాఫీ వచ్చింది. ప్లాట్‌ఫారమ్ మీదకి బాడ్జీలలో 'బిసిఐసి' వాలంటీర్లు వచ్చారు. ఇటువంటి సాంస్కృతిక సమావేశాలలో తమ వంతు కార్యభారం నెరవేరుస్తూ, యితోధిక సేవ చేసేందుకు, ఈ పండగలో పాలు పంచుకొనేందుకు యువతీ యువకులు ఎంతో ఉత్సాహం కనబరుస్తున్నారు. ఇందులో నాకు తెలిసినవారు, నాకు పరిచయమైన వారు, అద్దంకి శ్రీరామ్‌కుమార్, కందుకూరి భాస్కర్ వంటి బహు కొద్ది మంది మాత్రమే.... పద్మనాభరావు దంపతులు, జయాశేఖర్, రావి కొండలరావు, యన్నార్ చందూర్ – ఈ అయిదుగురికీ యకామడేషన్ ఎ పి భవన్‌లోనని ఒక వాలంటీరు మమ్మల్నొక కారులో ఎక్కించుకు తీసుకు వెళ్లాడు. జయాశేఖర్ వాళ్ల చిన్నాన్న యింటికి వెళ్లడం వల్ల రావి కొండ్రలావు రూమ్‌లో గోపీకృష్ణనీ, నా రూమ్‌లో బి కె ఈశ్వర్‌నీ యకామడేట్ చేయడానికి వీలయింది. మిగతా వారందరికీ టా ల్కొ టా రా స్టేడియమ్‌లో – ఆ ఇండోర్ స్టేడియమ్ దిగువ భాగాన సువిశాలమైన రూమ్స్ ఉన్నాయి. పది అడుగులు వేస్తే షామియానాలో కాఫీ టిఫినులు. ట్రాన్స్‌పోర్ట్ ప్రాబ్లెమ్స్ లేవు; సెక్యూరిటీ సమస్య లేదు. మొదటిరోజున ఉపరాష్ట్రపతి వస్తున్నారు గనుక ఎంతో బందోబస్తు.... ఎ పి భవన్ గోదావరి బ్లాకులో 503 నాది. సామాను సర్దుకు, హాయిగా స్నానం చేసి, కిందకొచ్చే సరికి బ్రేక్‌ఫాస్ట్ కూపను చేతికిచ్చి, తనని తాను పరిచయం చేసుకున్నారు శ్రీరామ్‌కుమార్ (ఆ లిం డి యా రేడియోలో తెలుగులో వార్తలు చదివే అద్దంకి మన్నార్ కుమారుడు). డైనింగ్ హాలులోకి వెళ్లి కూపను యిచ్చానో లేదో, ఎదురుగా బాలమురళి, అభయాంబిక. 'మీరెప్పుడూ యిలా ఒంటరిగా రావడం....' — అంటూ అల్లరి కబుర్లు మొదలుపెట్టారు బాలమురళి.... టాల్కొటారాకి, ఎ పి భవన్‌కి మధ్య దూరం అయిదారు కిలోమీటర్లు. 'బిసిఐసి' కారులో అక్కడికి వెళ్లి, శాస్త్రిగారిని పల్కరించి, ఈ కమిటీ ద్వారా మిత్రులైన రామ్మూర్తి, ప్రభాకరరావు, జివిజి కృష్ణమూర్తి, నాగరాజు మున్నగువారితో కబుర్లూ యోగక్షేమాలూ అయాక, నాగరాజు కారులో ఎపి భవన్‌కి వచ్చాము. రావి కొండలరావు రాధాకుమారీల ప్రోగ్రామ్ ఉందిక్కడ ఆంధ్రరాష్ట్రావతరణ వారోత్సవాల సందర్భంగా నవంబరు మొదటి వారంలో! నాగరాజు మా యిద్దరినీ ఎపి భవన్ ప్రధానాధికారి కిషన్‌రావుకి పరిచయం చేశారు. అయన ఎంతో సౌమ్యులు, స్నేహపాత్రులు.... రావి కొండ్రలావుకీ నాకూ ఒక బాధ్యత

ఉంది - పొరుగూరు వెళ్లినప్పుడు ఫలానా చోట వున్నాము, ఫలానా నెంబరులో సమాచారం అందుతుంది - అని యింటికి తెలియబర్చటం! ఈ విషయంలో ఏపాటి జాప్యం జరిగినా రాధాకుమారిగాని, మాలతీ చందూర్ గాని ఊరుకోరు. ఇరువురిలో ఏ ఒకరి నెంబరు దొరికినా, రెండోవారికి చెబుతారు. ప్రోగామ్ సమాచారం తెలిపేందుకు రాధాకుమారి నెంబరు ప్రయత్నించమన్నారు కొండల్రావు. అది దొరకక పోవడంతో మా యింటి నెంబరు ప్రయత్నించి, మాలతికి చెప్పి, రాధాకుమారికి మెస్సేజ్ (నాలుగు గంటలకి ఆమెనే ఫోన్ చేయమని) అందజేయమన్నాం. కిషన్‌రావు ఎంతో మంచివారు గనక ఈ శ్రమంతా పడ్డారు - మేము ఎక్కడున్నదీ ఏ నెంబరులో దొరికేదీ మద్రాసుకి మెస్సేజ్ వెళ్లింది. అతి ముఖ్యమైన ఆపని అయిపోయాక, 'పాలకి బజారుకి వెళ్తాం, రండి' అన్నారు. మమ్మల్ని అక్కడ దింపి వెళ్లిపోయారు నాగరాజు. ఒకనాటి మూర్‌మార్కెట్‌ని గుర్తుచేసే, ఆ అండర్‌గ్రవుండ్ ఎ సి బజారులో దొరకని వస్తువంటూ లేదు. నేనేమీ కొనేందుకు వెళ్లలేదు - చూసేందుకు! చూశాను, చూసి వచ్చాను. ఆ పూట భోజనం ఎ సి భవన్‌లో - నాలుగు గంటలదాకా విశ్రాంతి; ఆ పైన కాఫీ; టాల్కొటారా.... ఫ్లూట్ రమణి. మృదంగం భక్తవత్సలం, నేను ఒక వెహికిల్‌లో వచ్చాం. 'బిసిఐసి' ఢిల్లీ ఫెస్టివల్ బాడ్జిలతోబాటు, ఇన్విటేషన్



భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ వారు న్యూఢిల్లీ టాల్కొటారా ఇన్‌డోర్ స్టేడియమ్‌లో నిర్వహించిన సంగీతోత్సవాలలో అన్నమయ్య సంకీర్తనలతో శ్రోతలను పారవశ్యంలో ముంచిన

కార్డు, క్యూలో మెటల్ డిటెక్టర్‌తో చెకింగ్ యిత్యాదులయాక, లోనికి పంపారు. స్టేడియమ్‌కి అయిదారు ద్వారాలు ఉన్నాయి — ప్రతి ద్వారం వద్ద మరతుపాకులతో పోలీసులు. ఎవరు ఏ ద్వారం గుండా ప్రవేశించ వలసినదీ, ఆహ్వాన పత్రం మీద నెంబరు వేసి ఉంటుంది. ఇక లోనికి వెళ్లాక, ఉత్సవ కమిటీ సభ్యులు తప్ప మిగతా వారందరూ వారి వారి సీట్లలో కూర్చోవలసిందే! ఇటూ అటూ తిరగ కూడదు - స్థలాలు మారకూడదు. యూనిఫారమ్‌లోగాక మామూలు డ్రెస్‌లో, ఢిల్లీ పోలీసు శాఖకు చెందిన

ఉన్నతోద్యోగులు, తాము ధరించిన షర్ట్స్‌పై గుర్తింపు కార్డులతో, ఇరవై పాతికమంది దాకా ఉన్నారు లోన. ఇంకా ఎక్కువ మందేనేమో తెలీదు. వారి చూపులు నిరంతర పరిశీలనలో నిమగ్నమై వుండేవి..... ఇవ్వాళ, రేపు 'ది స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్ - (The Spirit of Freedom Concerts) అనగా 'బిసిఐసి' వారి ప్రధాన ధ్యేయమైన జాతీయ సమైక్యతను ప్రస్ఫుటం చేసే సంగీతోత్సవాలు. Come - Join the Spirit of Freedom అనే పెద్ద పెద్ద బానర్లు టాల్కొటాకా వెలుపల నుంచే ఆహూతులను ఆహ్వానిస్తూండగా, లోన ఎంతో కళాత్మకంగా స్టేజి ఏర్పాటులు చేశారు.... "అదినుంచీ మనది అవిచ్ఛిన్న సంస్కృతి అని చెప్పేందుకు అనేక నిదర్శనాలు ఉన్నాయి. జగత్కళ్యాణమే భారతీయుల ఆదర్శం. అనేక జీవ వాహినులలోని మంచిని స్వీకరించి, ఆ మంచిని పెంచి పోషించి శిల్పం ద్వారా, సంగీతం ద్వారా వ్యాప్తంచేసిన సహన మంతులు మన భారతీయులు. భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీవారు చేస్తున్న ఈ సత్కృషికి నేను జెట్టీగారిని, టివికె శాస్త్రిగారిని, యితర కార్యకర్తలను అభినందిస్తున్నాను," — అన్నారు ఉపరాష్ట్రపతి శంకర దయాళ్ శర్మ, 'ఫ్రీడమ్ కాన్సర్ట్స్'కి ప్రారంభోత్సవం గావిస్తూ! ఢిల్లీ ఉత్సవానికి ఫాట్రన్ అయిన జలగం వెంగళరావు, కేంద్ర పరిశ్రమల మంత్రి, బిసిఐసి కృషిని మెచ్చుకున్నారు. ఈ రెండు రోజుల సంగీతోత్సవ నిర్వహణకు సహాయ సహకారా లందించిన 'వియస్టి' ఇండస్ట్రీస్ మార్కెటింగ్ డైరక్టర్ బిపి సింగ్‌ని, బిసిఐసి అధ్యక్షులు జెట్టీ సత్కరించారు. మంగళం పల్లి బాల మురళీ కృష్ణ కర్ణాటక సంగీతం, పండిట్ జస్రాజ్ హిందూస్తానీ సంగీతం, వారి 'జుగల్ బందీ'లో ఒకదానితో ఒకటి మేళవిస్తూ, సమన్వయం పొందుతూ, కళ్యాణి రాగంలో సుధా చంద్రికలు విరజిమ్ముతూ, శ్రోతలని రసార్ణవంలో వోలలాడించాయి. సమస్తం ఆ సంగీత ఝురిలో తన్మయత్వం పొందింది. మాటలలోకి అనువదించలేము ఆ శ్రవణానందానుభూతిని.

..... 17

ఇవ్వాళ మధ్యాహ్నం రెండుగంటల దాకా, రేపు మధ్యాహ్నం పన్నెండుదాకా, ఎల్లుండి రోజంతా రాత్రి తొమ్మిదిన్నరకి స్టేషన్‌కి వెళ్ళే దాకా యితర పనులకి వ్యవధి ఉంది. చూడవలసిన మిత్రులూ, కర్టసీకాల్స్ చాలా వున్నాయి. నా ట్రాన్స్‌పోర్ట్ ప్రాబ్లెమ్‌ని మిత్రులు నాగరాజు నిముషాల మీద పరిష్కరించారు. 'ఉదయం ఎనిమిదిన్నరకి మీ బ్రేక్ ఫాస్ట్ పూర్తయేవేళకి నరీందర్ సర్వీసు నుంచి యంబాసిడర్ వస్తుంది. ఎన్ని గంటలకు కారు వొదిలినదీ, మీటరు రీడింగూ వేసి, డ్రయివర్‌కి యిచ్చేయండి. సోమవారం సాయింత్రం మీరు మొత్తంగా సెటిల్ చేయవచ్చు. ఫెస్టివల్ వున్న రెండు రోజులూ నూట

అర్ధరాత్రి మించి అవదు. సోమవారం పొద్దుట్నుంచీ రాత్రిదాకా గనక యింకో డెబ్బయి ఎనభై ఎక్కువ కావచ్చు. మూడు రోజులకీ అయిదారు వందల మధ్య అనుకోండి" అన్నారు, ఢిల్లీ ఫెస్టివల్ కార్య నిర్వాహకులలో ప్రముఖులైన నాగరాజు. ఆయన చెప్పినట్టే మూడు రోజులకీ కలిపి అయిదువందల ముప్ఫయి అయింది. నేను చూదామనుకున్న అందరినీ గాకపోయినా, చాలామందిని చూడ గలిగాను. ఈ ఢిల్లీ ప్రయాణంలో నాకైన ఖర్చు యిదొక్కటే - మిగతా దంతా, ఎపి భవన్‌లోని ఎసిరూమ్ నుంచి, భోజన ఫలహారాలు, రైలు ప్రయాణంలోని ఖర్చులూ, యింటి దగ్గిర్నుంచి బయలుదేరి మళ్లీ యింటి కొచ్చేదాకా అయిన అన్నిసాదరు ఖర్చులూ బిసిఐసి వారివి. "మీరు మా అతిథులు - మీ స్వంత సొమ్ము ఒక్క పైసా కూడా ఈ సాంస్కృతిక యాత్ర సందర్భంగా ఖర్చు కాకూడదు" - అంటారు శాస్త్రిగారు. ఈ రోజుల్లో మాటలు చెప్పేవారు అనేకులు. కాని, క్రియాత్మకంగా పద కొండు ఫెస్టివల్స్ దిగ్విజయంగా చేసి, పాతిక అయాక సిల్వర్ జుబిలీ జరుపుదాం - అని భవిష్యత్తుపట్ల అకుంఠిత విశ్వాసంతో పలకగల ధీరులు బహుకొద్ది. అసలు అటువంటి వారు చుట్టుపట్ల కనపడటమే లేదు. ఆర్గనైజర్‌గా శాస్త్రిగారి స్థానం యావద్భారతంలోను అద్వితీయం.... ఉదయం టాల్కొటూరా స్టేడియమ్ నుంచి దత్తుగారిని నాతో తీసుకు వెళ్లాను, డిఫెన్స్‌కాలనీలోని రామూ యింటికి, ఆ తర్వాత అతనితో మార్కెట్‌కి, మాలవ్యా నగర్‌లోని ఉషారాణి వద్దకు యిలా కొందరిని చూసి, దత్తుగారిని దింపి, ఎపి భవన్ చేరుకొనేసరికి ఒంటిగంట దాటింది. ఫంక్షన్ నాలుగు గంటలకి ప్రారంభమైనా మూడు లోపల స్టేడియమ్ చేరుకోవాలి. ఆకాశవాణి మిత్రులు అద్దంకి మన్నార్, ఏడిద గోపాలరావు, కందుకూరి సూర్యనారాయణ, పద్మనాభరావు మున్నగువారితో సంగీతోత్సవం ప్రారంభమయేదాకా కబుర్లు. ఇవ్వాళ ఎనర్జీ మంత్రి వసంతసాథె, సమాచార మంత్రి ఎకె పాంజా వస్తున్నారు.... "అడ్వకేటులూ ప్రొఫెసర్లూ రాజకీయవాదులైనప్పుడు, ప్రొఫెసర్ తన పిరెడ్ ఒకగంటా, అడ్వకేట్ తన ఆర్గుమెంట్ రెండు గంటలూ శ్రోతలపై రుద్దుతారు. సంగీత నాట్యాలకు పూర్వ రంగంలోని స్పీచెసెప్పుడూ చప్పగా ఉంటాయి.... ఈ సాంస్కృతిక సంస్థ గణనీయమైన సేవ చేస్తున్నది" - అన్నారు వసంతసాథె.... "ఎప్పుడూ గంటా గంటన్నర మాట్లాడే ఒక రాజకీయ నాయకుడు, శ్రోతలు తన ఉపన్యాసాలకు విసుగుజెందుతున్నారని గ్రహించి, సెక్రటరీని ఇరవై నిముషాలు మించకుండా స్పీచ్ రాసివ్వమన్నాడట - ఆయన అలాగే రాసిచ్చాడు. ఈ నాయకుడు వేదిక ఎక్కి చదవడం మొదలుపెట్టి, చివరి

కాగితం దగ్గరకొచ్చేసరికి పూర్తిగా ఒక గంట అయింది. 'ఏమయ్యా, యిరవై నిముషాలకి సరిపడేది రాయ మంటే, గంటసేపుపట్టే స్పీచ్ రాశావు?' అని నిలవదీశాడు సెక్రటరీని. 'సార్, నేను ఇరవై నిముషాలకే రాశాను; మీకు మూడు కాపీలిచ్చాను - మీరు ఆ మూడూ వరసని చదివేశారు' - అన్నాడు. రాజకీయులని ఎంత కొద్దిగా మాట్లాడమన్నా, వారికి ఉపన్యాసం ప్రారంభించడమే తప్ప, ఎక్కడ ఆపాలో తెలీదు. వేదిక మీదున్న యిద్దరు మంత్రులమూ 'లా' చదువు కున్నవారమూ, మాట్లాడటం మా వృత్తి ధర్మమూ కాబట్టి, మొదలు పెడితే అపము. మిమ్మల్ని ఈ పూట పెట్టదలుచుకోలేదు. హాయిగా నృత్య గానాలు ఆనందించండి. ఈ సంస్థ చేస్తున్న కృషికి నా అభినంద నలు" అన్నారు పాంజా.... వియస్‌టి ఇండస్ట్రీస్ బిపి సింగ్, ప్రతీ సంవత్స రం తాము ఒక ఉత్తమకళాకారుని కిచ్చే పాతికవేల పర్సు ఈ సంవ త్సరం బాలమురళికి బహూకరిం చారు.... "ఈ దేశంలోని సంస్కృతీ పరిరక్షకులు స్త్రీలు. నాట్యవిద్య, సంగీతాభ్యాసం ద్వారా కానీయండి, పండగలూ ఆచారాలూ పాటించడం వల్ల కానీయండి - భారతీయతను కాపాడుతున్నది స్త్రీజనావళి మాత్రమే.... ఏ సమాజంలో అయితే, సృజనాత్మకత నశిస్తుందో, అది కాల గర్భంలో కలిసిపోక తప్పదు. సంఘ పరంగా సృజన లక్షణాన్ని సంరక్షిం చేవే లలితకళలు. వాటిని కాపాడు కోవటం ద్వారానే మన నాగరికతకు జీవ స్పందన నివ్వగలుగుతాము" - అన్నారు జివిజి కృష్ణమూర్తి.... హరి ప్రసాద్ చౌరాసియా, ఎన్ రమణీల ఫ్లూట్ 'జుగల్ బందీ' శ్రోతలను సంగీత తరంగాలపై ఊయల లూపింది. ఆపైన బిజు మహరాజ్ శిష్యుల కథక్ నృత్యాలు నేత్రపర్వంగా సుమనోజ్ఞంగా, లావణ్య గీతికల తరళకాంతులా అన్నట్లు ప్రదర్శిం చారు.... రేపు మూడోరోజు - ముఖ్యమైన రోజు; మధ్యాహ్నం ఒంటి గంట నుంచి రాత్రి పదిన్నరదాకా! ఈసారి వెంకటేశ్వరస్వామి కళ్యా ణంతోబాటు రుద్రాభిషేకం. తెల్లారే సరికి స్టేజి అంతా మారిపోతుంది. ఏర్పాటులు పూర్తయేసరికి రాత్రి రెండుగంటలు దాటుతుంది. ఆ భార మంతా రామ్మూర్తి, ప్రభాకరరావు మున్నగువారిది. ఈ మూడురోజుల కార్యక్రమ ప్రయోక్తలు పద్మనాభ రావు, జయాశేఖర్. 'ఆ స్వీట్‌వాయిస్ ఎవరిది, ఆమె ఏమి చేస్తూవుంటారు?' అని ఎందరో అడిగారు. 'ఆమె యిద్దరు పిల్లలతల్లి - రంగనాథన్ ఇన్‌స్టిట్యూట్‌లో పిఆర్ఓ ఆ సుందర వదన' అని అడిగిన వారికలా చెప్పాను.

## .....18

ఇవ్వాళ నాతో ఈశ్వర్‌ని తీసుకు వెళ్లాను. ఇద్దరు ముగ్గురిని చూశాక, మాలవ్యానగర్. భాటియా దంపతుల

యింట్లో లంచ్. గణేశ్వర్రావూ, శాంతా కూడా వచ్చారు. కుటుంబ విష యాలు, కరెంట్ టాపిక్స్తో నిము షాలు యిట్టే దొర్లిపోయి, అప్పుడే పన్నెండున్నర అయిందా అనిపించింది. ఇవ్వాళ ఉత్సవం రెండు గంటల నుంచే, పళనిస్వామి నాదస్వరంతో ప్రారంభమవుతుంది గనక నేనూ. ఈశ్వర్ ఒంటిగంటకు టాల్కొటారా చేరుకోవాలి.... బసవరాజు బ్రదర్స్ వాద్య సంగీతం తర్వాత, అటార్నీ జనరల్ పరాశరన్ స్వాగత వచనం చెప్పారు - ఢిల్లీలోని ఈ ఉత్సవానికి అహ్వాన సంఘాధ్యక్షులాయన. కళ్యాణో త్సవ మయ్యేదాకా వుండే పరాశరన్, యివ్వాళ మధ్యలో వెళ్లిపోవలసి వచ్చింది (మర్నాడు ఉదయం హైద రాబాదు అంధ్రా హైకోర్టులో, అయన అర్గుమెంట్ వుంది - ముఖ్యమంత్రికి సంబంధించిన కేసు విషయంలో) ఈ నాటి కార్యక్రమానికి అధ్యక్షత వహిం చిన హ్యూమన్ రిసోర్సెస్ (మానవ వనరుల) మంత్రి పి వి నరసింహారావు, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీవారి కృషిని అభినందిస్తూ, సత్కార నిర్వహణలో పాల్గొన్నారు. సత్కార గ్రహీతలు: స్వాతంత్ర్య యోధులు భద్రయాజి, మాజీ ఛీఫ్ జస్టిస్ అఫ్ ఇండియా చంద్రచూడ్, ఛీఫ్ ఎల క్షన్ కమిషనర్ పేరిశాస్త్రి, భోపాల్ ట్రాజడీ సందర్భంగా అనుపమకృషి జరిపిన సైంటిస్ట్ వరదరాజన్, వాగ్గేయకారులు బాలమురళి, నృత్య కళాకారిణి యామినీ కృష్ణమూర్తి, పత్రికా రచయిత దత్తాత్రేయ శర్మ మున్నగువారు. కొండకు రప్పించు కోమని అనంద్ గొంతెత్తి పాడగా, అన్నమయ్య పదరచనలోని పారి జాతాలు వెదజల్లారు శోభారాజు, బాల మురళి కీర్తనామృతంలో సంగీత సుధలు ప్రవహించగా, పేనాజ్ మసానీ భజనగీతాలూ ఘజల్స్ కోకిల గానమై పలికాయి. వందన సమర్పణలో సి హెచ్ జి కృష్ణమూర్తి (ఇన్కమ్‌టాక్స్ యప్పలేట్ ట్రిబ్యూనల్ ఛెయిర్మాన్) టివికె శాస్త్రి చిత్తశుద్దినీ ఆశయలక్ష్యాన్నీ ప్రశంసించారు. గాయత్రీ స్వామి పర్యవేక్షణలో, ఉపరాష్ట్రపతి శంకర్ దయాళ్ శర్మ ఆయన సతీమణి సమ క్షంలో వేలాది ప్రేక్షకులు, కిక్కిరిసి వున్న ఇన్‌డోర్ స్టేడియంలో కనుల పండువగా బాలాజీ కళ్యాణోత్సవమూ, రుద్రాభిషేకమూ తిలకించారు. ఈ దేవుడి పెళ్లికి ఎందరో పెద్దలు; ప్రతి గుండెలోను ఏదో నిర్నిద్రగానం. పల్లకీ తాకేందుకు మోసేందుకు పడ్డ ఆత్రం, ఆరాటం స్వయంగా చూస్తేగాని బోధ పడదు. కర్పూరహారతి యిస్తున్న ప్పుడు ఎన్నిజతల కళ్లు భక్తిభావంతో ప్రణమిల్లాయో ఆక్షణాన! బాల మురళి, శోభారాజ్లు పద్మావతీ శ్రీని వాసులకు లాలిపాట పాడాక, ప్రసా దం పంచిపెట్టారు.... ఢిల్లీ మహానగ రంలో, టాల్కొటారా ఇండోర్ ఎసి స్టేడియంలో, మూడురోజుల పాటు జరిగిన ఈ సంగీతోత్సవానికి, పైసా టికెట్ లేదు; విరాళాలు కోరరు - అంగీకరించరు: ముందుగా వ్రాసి

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!




# త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి



త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001.

యడ్మిషన్ కార్డు తెప్పించుకుంటే చాలు : సక్రమంగా కోరిన అందరికీ ఈ ప్రవేశ పత్రాలు లభిస్తాయి : ఒక్కొక్క కార్డుమీద యిద్దరు రావచ్చు. 'బి సి ఐ సి' లోని ప్రత్యేకత, ఘనత అదే !

. . . . 19

ఉదయం ఎనిమిదిన్నరకి నరేందర్ సర్వీసు నుంచి యంబాసిడర్ వచ్చింది. మధ్యాహ్నం దాకా గణేశ్వర్రావు తోడుగా ఉంటానన్నారు. యడ్రస్‌లైతే దగ్గిర వుంటాయిగాని ఈ మహాపట్నాలలో ఉత్తర దక్షిణాలు తెలియవు కద ! మొదటిరోజు వచ్చిన డ్రయివరు, ఇవ్వాళ వచ్చిన డ్రయివరూ సిక్కులు ; ఇవ్వాళ వచ్చిన సర్దార్జీకి మద్రాసూ మైలాపూరూ బాగా తెలుసు; రాయపేట హైరోడ్‌లో వాళ్ల బ్రదర్ షాపు ఉన్నదట ; కె కె నగర్‌లో వాళ్ల యిల్లు వున్నదట ; ఇంగ్లీషు చక్కగా మాట్లాడుతాడు. మొదటిరోజున వచ్చిన సర్దార్జీకి యింగ్లీషు యింతబాగా రాకపోయినా, మనం చెప్పినది అర్థమవుతుంది – పొడిమాటలలో జవాబు చెప్పగలడు. కలుపుగోలుతనమూ, వినయమూ, సహకార చింతన వారిని చూసి నేర్చుకోవాలి. సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్ట్, ప్రెస్ ఇన్‌ఫర్మేషన్, ఫిరోజిషారోడ్, నార్త్ ఎవిన్యూ, మునిర్కా – యిలా చాలా చోట్లకి వెళ్లాం. పతంజలి 'వాన్‌కొవర్' విశేషాలు చెప్పారు; చౌధురి తమిళ నాడులో శ్రీలంక గురించి ఏమనుకుంటున్నారో అడిగారు ; యన్‌జి రంగా, ఖాట్టం, దుగ్గిరాల సుబ్బారావు మున్నగువారు ఊళ్లో లేరు.. రెండు గంటలకు నన్ను ఎపి భవన్ వద్ద దిగబెట్టి, తన స్కూటర్‌మీద కాలేజీకి వెళ్లారు గణేశ్వర్రావు ; సాయంత్రం ఏడూ ఏడున్నరకి వస్తానన్నారు.... మూడు గంటలకి కందుకూరి సూర్యనారాయణ దంపతులు వచ్చారు. రాజారెడ్డి, పద్మా సేథ్, సదరన్ ట్రావెల్స్ వెంకటేశ్వర్రావు మున్నగు వారి వద్దకు వారు తీసుకు వెళ్లామన్నారు. ఆయనకు ఆకాశవాణిలో పనివుండటంవల్ల ఆ భారం శ్రీమతిపై పడింది. తాళ్లూరి వెంకటమహాలక్ష్మిగా 1956 నాటి 'ప్రమదావనం' తొలి రచనతో, ఆమె మాలతీచందూర్ ఫాన్ ; అంచేత, ద్వితీయార్థంపై కూడా కొంచెం అభిమానం. భర్తతో అయిదేళ్లపాటు మాస్కోలో వుండి వచ్చింది ; బల్గేరియాలో మూడు వారాలు ఒక్కర్తె ప్రయాణం చేసింది; తండ్రిగారి ప్రోత్సాహంవల్ల రచనా వ్యాసంగం అలవరుచుకుంది; ప్రస్తుతం 'వనితాజ్యోతి' విలేఖరిగా పని చేస్తున్నారు కందుకూరి మహాలక్ష్మి; ప్రముఖవనితల ఇంటర్వ్యులు వ్రాసి పంపడం ఆమె ప్రత్యేకత. ఎన్నోకథలు రాశారు ; ఎన్నో రచనలు చేశారు.... వెళ్లవలసిన చోట్లకి వెళ్తూ, మళ్లీ కారులోకి వచ్చి కూచున్నప్పుడు, అనేకానేక విషయాలు సంభాషణలో దొర్లేవి – అవి యిక్కడ అప్రస్తుతం.... ఇవ్వాళ గణేశ్వర్రావు, మహాలక్ష్మి తమ పనులు మానుకొని నా కోసం వారి

ట్రైమెంతో వెచ్చించారు. గణేశ్వర్రా వంటే చాలా సంవత్సరాలుగా తెలుసు. కాని, కందుకూరి దంపతులతో పరిచయం ఈ ఉత్సవ సందర్భంగానే! వారు చూపిన ఆదరణ, ఆప్యాయత మరువలేనివి, మరుపురానివి.... పొద్దుట ఎనిమిదిన్నరనుంచి రాత్రి ఎనిమిదిదాకా నాతో వున్న సర్దార్జీకి థాంక్స్ చెప్పి (ఇక్కడ డబ్బుకాదు ముఖ్యం - స్పందన, మానవత), రూమ్‌కెళ్లి బట్టలు సర్దుకు, ముగ్గురు నలుగురితో గణేశ్వర్రావు సహాయం వల్ల ఫోనులో హల్లో చెప్పి, డైనింగ్ హాలు కొచ్చి భోంచేసి, అప్పుడే లోనికి వస్తున్న నాగరాజు, టివికెల వద్ద వీడ్కోలు తీసుకు, రావి కొండల్రావు, ఈశ్వర్, గోపీకృష్ణలతో స్టేషన్‌కి! ఈసారి 'యస్-3' బోగీ - దత్తుగారి ఫామిలీతో తిరుగు ప్రయాణం, - మధ్య మధ్య ఉత్సవ విశేషాలు చెప్పుకుంటూ!

. . . . . 21

'కన్స్యూమర్ ప్రొడక్షన్ కౌన్సిల్ మీటింగ్ ఎలా జరిగింది?' అని భోజనాలవేళ అడిగినప్పుడు మాలతి చెప్పింది: "పదిహేడో తేదీ సాయింత్రం, రాజా అన్నామలైనగర్ నారాయణీ కళ్యాణమండపంలో తారా చెరియన్ అధ్యక్షతను జరిగింది – చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది. మాది మద్రాసు సౌత్ కౌన్సిల్. రిటైర్డ్ పోలీసు కమిషనర్ డయాస్ - మనం ఒకసారి సుందరీమణీ యింట్లో కలుసుకున్నామే ఆయన స్వాగతం చెప్పారు. అవిన్, ఐ. ఒ సి, ఐ. యస్. ఐ అగ్‌మార్క్, బుష్ బొక్స్ (Aavin, Indian Oil Corporation, Indian Standards Institution, Agmark, Bush Boake Allen (India) Ltd.) మున్నగు ప్రసిద్ధ సంస్థల ప్రతినిధులు స్టాల్స్ పెట్టారు. డిపార్ట్‌మెంట్ ఆఫ్ సివిల్ సప్లయిస్ డిప్యూటి కమీషనర్ అన్సారాలీ, కన్స్యూమర్‌కీ ప్రొడ్యూసర్‌కీ మధ్య ఎటువంటి సదవగాహన ఉండాలో వివరించారు. అవిన్, అగ్‌మార్క్. ఐ యిస్ ఐయివి తెలిసినవే! కుకింగ్ గాస్ లీక్ వాసన తెలియగానే కిటికీ తలుపులన్నీ తెరవమనీ, బావున్నట్టు కనిపిస్తున్నా రెండేళ్లకొకసారి రబ్బరు హెూస్ మార్చమనీ, ఇంటికొచ్చిన సిలెండరుని బిల్లు యిచ్చే లోపలే సీలు సరిగా వున్నదీ లేనిదీ చూసుకోమనీ, గాస్ విషయంలో అశ్రద్ధ పనికిరాదనీ ఏ మాత్రం అనుమానం సోకినా ఎలక్ట్రిక్ దీపం వేయవద్దనీ - ముందు జాగ్రత్తలు చెప్పారు 'ఐఓసి' పి ఆర్ ఒ. పేర్లేతే జ్ఞాపకం లేదు గాని ఆమె చక్కటి సలహాలు ఇచ్చారు.... నిన్న 'లోధ్ర' శేషగిరి రావుగారి శతాభిషేకానికి అక్కకూడా వచ్చింది. మామయ్య ఢిల్లీ వెళ్లారనీ రేపు వస్తున్నారనీ చెప్పాను. దాస ప్రకాష్ పింక్‌హాలులో జరిగిన ఈ శతాభిషేక పూజా కార్యక్రమం మేము వెళ్లేసరికి యించుమించు అయిపోయింది. కొడుకులు కోడళ్లు వారి సంతానం స్వజన బంధుమిత్రాదుల సమక్షంలో జరిగిన ఈ 'సహస్ర పూర్ణిమ ఒక ప్రశాంతమైన పండుగలా ఉంది'

. . . . 25

దానధర్మ దయాశీలురు, వేద విద్యలపట్ల హైందవధర్మంపట్ల గౌరః విశ్వాసాలతోబాటు లలిత కళలపట్ల అ మి త మై న ఆదరణగలవారు, సాహిత్యాభిమాని, సంస్కరణాభిలాషి, సాంస్కృతిక విలువల పరిరక్షకులు, వ్యాపారదక్షులు, పారిశ్రామికవేత్త, స్నేహశీలి అయిన బివియస్సెస్ మణి గారి షష్టిపూర్తి ఉత్సవం భారతీయ విద్యాభవన్‌లో! జెవి సోమయాజులు ఈ కమిటీకి అధ్యక్షులు; పప్పు వేణుగోపాలరావు, పాండురంగ కన్వీనరులు; యమ్మెస్‌రెడ్డి ఉపాధ్యక్షులు; హరిప్రసాదరెడ్డి కోశాధికారి; ముప్ఫయ్యయిదుగురు ప్రముఖులు కమిటీ మెంబర్లుగా ఉన్నారు. అధ్యక్షత వహించిన జస్టిస్ వేణుగోపాల్, మణిగారికి ఎన్ని పారిశ్రామిక సంస్థల తోను విద్యావ్యాసంగా సంస్థలతోను సాంస్కృతిక సంస్థలతోను అనుబంధం ఉన్నదో పేరు పేరున చెబుతూ, ఆయన ఎటువంటి గుప్తదానం నిరాడంబరంగా చేయగలరో ఒక ఉదాహరణ చెప్పారు.... తమ తండ్రి గారికీ, కౌతా సూర్యనారాయణరావు గారికీ ఎటువంటి స్నేహం ఉండేదో, బ్రాడ్వే రోజులలో తమ రెండు కుటుంబాలూ ఎంత సన్నిహితంగా ఉండేవో చెప్పారు ముఖ్య అతిథి డిసి కొ ‌ంరి. రమణయ్యరాజా దంపతులు ‌ణి దంపతులని నూతన వస్త్రా తో సత్కరించారు. ఎందరెందరో ‌ణి గారిని పూలమాలలతో నుంచె గ

యమ్మెస్ రెడ్డి కవితా ప్రసూనాలు చల్లారు; జయా శ్రీనివాసన్ రామాయణం నుంచి చక్కటి ఉదంతం చెప్పారు; చతుర్విధాశ్రమాలలో గార్హస్థమే ఎందువల్ల ప్రశస్తమైనదిగా ప్రాచీనులు పేర్కొన్నదీ వివరించారు చిన్ని కృష్ణయ్య. అభినందించినవారికి కృతజ్ఞతలు తెలుపుతూ, తను చేయదలుచుకున్నదీ, చేయవలసినదీ యింకా చాలా వున్నదనీ, వయసుపై బడ్డ వ్యక్తిగా తను ఎంత మాత్రం తల పోయడం లేదనీ, ద్విగుణీ కృతోత్సాహంతో భవిష్యత్తులోకి చూస్తున్నాననీ అన్నారు బివి యస్సెస్ మణి, తమ సమాధానంలో! పాండురంగ, సభా కార్యక్రమం నిర్వహించగా, హరిప్రసాదరెడ్డి వందన సమర్పణ గావించారు. విజయవాడనుంచి వచ్చిన కొత్తపల్లి పద్మ బృందం, సుప్రసిద్ధమైన కూచిపూడి నృత్య నాటిక 'భక్త ప్రహ్లాద'ను ఎంతో రసవత్తరంగా ప్రదర్శించారు.... తాతగారైన కౌతా సూర్యనారాయణరావు స్థాపించిన ధర్మ కర్తృత్వ సంస్థలను, తదితరములను తన 21 వ ఏట నుంచి ఎంతో వి జ య వం త ము గా నిర్వహిస్తున్న బివియస్సెస్ మణిగారు, వేదాధ్యయనాన్ని, ఇంజనీరింగ్‌నీ అధునిక మానవుని రెండు నేత్రాలుగా చూడగల సంస్కృత భాషాకోవిదుడు, ప్రముఖ పారిశ్రామిక వేత్త.

—యనా్ర్ చందూర్

# ముఖచిత్రం

1962 మే నెల 27వ తేదిన ఆంధ్ర మహిళా సభ రజతోత్సవాలకు భారత రాష్ట్రపతి రాధాకృష్ణన్ ప్రారంభోత్సవం గావించారు— ఇది వజ్రోత్సవ సంవత్సరం. దేశ భాషలన్నిటిలోని రచయిత్రుల గ్రంధాలు సేకరించి పుస్తక ప్రదర్శన నిర్వహించిన సందర్భంగా అప్పట్లో ఏర్పడ్డ అనుబంధం, ఆంధ్ర మహిళా ప్రెస్ హైదరాబాదుకి తరలించే దాకా, ఎంతో ధృడతరంగా ఉండేది. పాతికేళ్ళ క్రితం వారెన్ రోడ్ యింట్లో ఒక సాయంత్రం వేళ అన్నారామె: 'ఇకనుంచి మీ యిద్దరూ మా కుటుంబంలోని వారు' అని! అంతే, అప్పట్నుంచి వారి కుటుంబ సభ్యులం. ఆమె డైనమిజమ్, కార్యోత్సాహం, కార్యదక్షత, కరుణాంతరంగం – అతిక్లిష్టమైనవి అవలీలగా సాధించడం, తమ్మునితో (బివిడి నారాయణరావ్) వివాద పడుతూనే ఆయన పాయింట్ చివరికి వొప్పుకోవడం, ఒకరి కొకరై బతికిన దేశముఖ్ దంపతుల జీవన పరిమళ తరంగాలు, ఆ అనురాగ దీప్తులూ అన్నీ కాల యవనికలో కలసి పోయినప్పటికీ ఆ స్మృతులు చెరగవు. సాధారణంగా ఎవరికీ వానగూడని మహద్భాగ్యమది. దుర్గాబాయి, నారాయణరావు, దేశముఖ్ —— ఈ త్రిమూర్తులు నిర్మించిన మహాసౌధం ఆంధ్ర మహిళా సభ, ముగ్గురూ తెర వెనక్కి తప్పుకున్నారు. ఈ ముగ్గురితో సుపరిచయం గల జస్టిస్ గంగాధరరావు ట్రస్ట్ బోర్డు అధ్యక్షులుగా కార్య భారం నిర్వహిస్తున్నారు. ఆంధ్ర మహిళా సభ ఈనాడు శాఖోపశాఖలుగా విస్తరించిన ఒక విస్తృత స్వచ్ఛంద సేవా సంస్థ. మద్రాసులో మహిళా విద్యాలయ, మల్లమదేవి వర్కింగ్ వుమెన్స్ హాస్టల్, ఈశ్వరీ దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటర్, దుర్గాబాయి దేశముఖ్ హాస్పిటల్, మల్టీ పర్పస్ ఫిమేల్ హెల్త్ వర్కర్స్ ట్రయినింగ్, టూరిస్ట్ హాస్టల్, సిల్వర్ జుబిలీ హాల్, పోలీక్లినిక్, ఆశ్రయ షెల్టర్ హోమ్ ఉన్నాయి. హైదరాబాదులో: హాండీక్రాఫ్ట్స్ ఇన్‌స్టిట్యూట్, దుర్గాబాయి దేశముఖ్ హాస్పిటల్, కార్డియో వాస్కులర్ యూనిట్, ఫామిలీ వెల్ఫేర్ క్లినిక్, మినీ హాస్పిటల్ ఆన్ వీల్స్, బ్లడ్ బాంక్, మహిళా విద్యాలయ, వొకేషనల్ ట్రయినింగ్ అండ్ రిహాబిలిటేషన్ సెంటర్ ఫర్ ఫిజికల్లి హాండీకాప్డ్, లీగల్ ఎయిడ్ సెంటర్, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజ్ ఫర్ వుమెన్, కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, లిటరసీహవుస్, గాంధీ విద్యా భవన్.... అలాగే మహబూబ్ నగర్, సంగారెడ్డిలలో వివిధ శాఖలున్నాయి. స్వచ్ఛంద సేవలో ఆదర్శప్రాయమగు స్థానం దుర్గాబాయి దేశ్‌ముఖ్ స్థాపించిన ఆంధ్ర మహిళా సభది.



# సమీక్షలు  చిత్రజగతి

## తారక ప్రభు వారి 'ఆత్మ బంధువులు'

కొడుకులు చేతగానివాళ్లు, కోడళ్ల చేతుల్లో కీలు బొమ్మలూ అయిన మీదట, వారి తల్లి దండ్రులు ఏ విధంగా యిక్కట్ల పాలయేదీ, అవిభక్త కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నం కాగా 'వోల్డ్ ఏజ్ ప్రాబ్లెమ్'ని ఎలా పరిష్కరించాలి? - అనే విషయంపై ఈ మధ్య సినిమావారికి ప్రత్యేకాసక్తి ఏర్పడుతోంది. స్వచ్ఛంద సేవా సంస్థలు, వయోవృద్ధుల కోసం అనేక చోట్ల 'విశ్రాంతి గృహాలు' నిర్వహిస్తున్నాయి - అవి వీరి కనవసరం. 'పిల్లలు కలగకపోతే నేను చచ్చిపోతాను' అని ఆనందరావు (నాగేశ్వరరావు) యాదాలాపంగా అన్న మాట పట్టుకు, అతని భార్య రాధ (రాధిక), పిల్లవాడిని కని, భర్త చేతుల్లో పెట్టి, సినీ వాగ్దానాలు తీసుకు, మరణిస్తుంది. 'యబార్షన్ చేయించుకోకపోతే ప్రసవానంతరం మరణిస్తావు' అని లేడీ డాక్టరు వార్నింగ్ యిస్తుంది; అయినప్పటికీ ప్రాణత్యాగానికీ, పుత్రోదయానికీ సిద్ధపడుతుంది ఈమె. శిశువు సజీవంగా జనిస్తుంది గాని తల్లి మరణిస్తుంది (సిజేరియన్ చేయవచ్చుగా) అని ఆ లేడీ డాక్టరు ఏ అంచన ప్రకారం చెప్పగలిగిందో మా తెలీదు. కొడుకు బంగాళా అ హవుజ్‌లో, పాతికేళ్లుగా ఆ జ్ఞాపకాల బతుకుతూ, ప్రతి ఉదయం మనమ రాజేష్‌ని కాన్వెంట్‌కి తీసుకువె వాడితోపాటు తనూ అయిస్ ఫ్రూ కొనుక్కు తింటూ వుంటాడు ఆనం రావు. అలాగే 'కళ్యాణి నిలయ' కళ్యాణి (జయసుధ) తన మను రాలు అలేఖ్యని అదే కాన్వెంట్ తీసుకు వెళ్తూవుంటుంది. లాయరు భ వానులు (దాసరి) భార్య (ప్రభ) త కడుపు పండాలని తపించిపోత వుంటుంది. జ్ఞాపకాలలో బతికే దిక్కు లేని వాళ్లిద్దరూ (ఆనందరావుకి భార లేదు, కళ్యాణికి భర్త లేడు; అయి యిద్దరికీ దౌర్భాగ్యులైన కొడుకులు నీచబుద్ధి గల కోడళ్లూ వున్నారు) ఆత్మ బంధువులవటం, చెరో వాటాలో వుంటూ స్నేహితులవటం సర్వ సహ జం- గోడలకు వెల్ల వేయన వసర లేని కూలిన పునాదులవి. కాగా స్క్రీన్‌ప్లే, కథా పరిణామానికి అన గుణంగా లేదు. దర్శకత్వం: దాస నారాయణరావు. నిర్మాత: దాసరి పద్మ

## ఇండో వోవర్‌సీస్ వారి
## 'పోలీస్ స్టోరీ'
## (Police Story)

యాక్షన్ హీరోగా జాకీ ఛాన్‌కి ackie Chan) గల ప్రత్యేక స్థానం, ప్రొటెక్టర్' (The Protector) చిత్రం సినవారికి చెప్పనవసరం లేదు. స్తవికమా, సంభవనీయమా అను శ్నలకు అస్కారం లేదు.... నార్కొ క్స్ గాంగ్‌ని పట్టుకొనే ప్రయ నంలో డిటెక్టివ్ జాకీ ఛాన్ ఎంతో ర్పు కనబరిచి, 'పోలిస్ రయిడ్' రిపిస్తాడు. అయితే, పోలీసు బలగం న్నే ఆ ముఠాతో చేతులు కలిపిన రు కొందరు వుండటంచేత, అందమైన ఆడసాక్షి యితని రక్షణ నిరాకరిస్తూవుంటుంది. గాంగ్ లీడరుని ముద్దాయిగా నిలబెట్టినప్పటికీ కేసు వోడిపోతుంది. జాకీ ఛాన్‌ని పోలీసులు ఒక హత్య కేసులో యిరికిస్తారు. చివ రికి యిటు పోలీసులనీ, అటు దొంగల ముఠానీ యిరువురిని చిత్తు చేసి, విజయధ్వజం ఎగర వేస్తాడు జాకీ ఛాన్. పోలీసుల్లో 'దొంగలున్నారు జాగ్రత్త' అని హెచ్చరిక చెప్పే చిత్ర మిది .... ఆంధ్రాలో పద్మావతి పిక్చర్స్ (గాంధీనగర్, విజయవాడ - 3) ఈ చిత్రాన్ని రిలీజ్ చేస్తున్నారు....

పిఆర్ఒ : టియమ్ రామన్

లక్ష్మీ జనరల్ స్టోర్స్
బెసెంట్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ.

కంచి, ధర్మవరం,
బెంగుళూరు, బెనారస్ పట్టు చీరలు,
టెరిలిన్ షర్టింగులు, సూటింగులు,
రెడీమేడ్ దుస్తులకు-
ఆంధ్రదేశమునందు ప్రసిద్ధిచెందిన ఆధునిక బట్టల షాపు

## పద్మాలయా వారి
## 'సామ్రాట్'

రాజ్యలక్ష్మీదేవి (శారద) కుమారుని పేరు సామ్రాట్ (రమేష్‌బాబు); వారి ఆస్తిని ఫణిభూషణ రావు (రంగనాథ్) భానూప్రసాద్‌తో (నూతన్ ప్రసాద్) చేతులు కలిపి, ఇరవై ఏళ్ల క్రితం కబళించివున్నాడు కోర్టులో కేసు యింకా నడుస్తోంది. ఫణిభూషణరావు రావుబహద్దూర్ అయాడు ; కోటీశ్వరుడయాడు. బ్రిటిష్‌వారు మనని వొదిలి వెళ్లి నలభై ఏళ్లయినా, సినిమావారు మాత్రం రావుబహద్దూర్‌లని వొదల్లేకుండా వున్నారు. ఈ ఫణి గారి ఏకైక పుత్రిక, ఆట పాటలలోను, అహంకారంలోను అగ్రహావేశంలోను, అన్నుల మిన్న అయిన డిస్కో రేఖా (సోనమ్). స్టడ్ ఫారమ్ సామ్రాట్టు చిన్నప్పుడు కలిసి మెలిసి ఆడుకొనే వారు. వారిద్దరికీ పెళ్లిచేయవలసిందిగా మృత్యుశయ్యపై వున్న ఫణిభూషణ రావు భార్య, రాజ్యలక్ష్మీదేవి వద్ద నుంచి మాటకూడా పుచ్చుకొంది - అప్పట్లో వీరు అతి భాగ్యవంతులు — వారు సర్వసామాన్యులు. ఈ విషయం రాజ్యలక్ష్మీదేవి తన కుమారుడు సామ్రాట్‌తో ప్రారంభ ఘట్టాలలోనే అంటుంది కూడా ! గుర్రాలని మచ్చిక చేసుకొనే విద్యలో ప్రవీణుడు సామ్రాట్. ప్రకృతివడిలో, నీటివాగు పక్కన, మనోహర దృశ్యాల మధ్య పాములూ దుష్టమృగాలూ ప్రవేశించడానికి వీలుగాని ఎత్తయిన కర్ర యింట్లో, నర సంచారం లేని అ మధ్యాన, పశువులూ, కో గుర్రాలూ మధ్య, మోతీతో (పెంప కుక్క) జట్కాబండీ మామయ్య (ప నాభం) ఒక్కడే సాయంగా, ఆ కొడుకులు ఆదర్శ ప్రాయమగు యాత్ర సాగిస్తూవుండగా ఆశ్విక రె అయిన హీరో, పొగరుమోతు పి మచ్చిక చేసుకు, పవిత్రప్రేమ కడపటి విజయమని నిరూపించ యిందులోని యితివృత్తం. హాలీ 'వెస్టర్న్స్'లో తప్ప, ఈ మాదిరి 1 శతాబ్దపు, రైలుబద్దీలుపడ్డ కొత్తరి రోజుల్లోని స్టడ్ ఫారమ్స్ ఎక్క చూడము. సోనమ్ వొంటి వొంప ప్రేక్షకులకు గిలిగింతలు పెట్టి గుర్రపురౌతుగా రమేష్‌బాబు భేష్ పిస్తాడు. మోతాదు మించిన వైలె దర్శకత్వం : వి. మధుసూదనరా సమర్పణ : కృష్ణ. నిర్మాతలు : ప మంతరావు, ఆదిశేషగిరిరావు.

## ఉషాకిరణ్ వారి
## 'చందమామ రావే'

ఇద్దరు జేబుదొంగలు, సూరి (నూతన్ ప్రసాద్), రాంబాబు (చ మోహన్), సంవత్సరానికి పది జైలులో వుండే సుప్రసిద్ధులు. సమాజ స్వరూపంపై స అభిప్రాయాలుగల విప్లవకారులు, గారం నుంచి బయటికొచ్చాక, చిన్న దొంగతనాలు మానేసి, ముప్ప లక్షలతో 'ఫిక్స్' అయిపోదా కోటీశ్వరుని కూతురు అయి

పని (సుజిత) ఎత్తుకొస్తారు. ఆ కోటీ
పని మొదటి భార్య కూతురు ఈ
ప; మొదటి భార్య చనిపోగా,
డవ భార్యని చేసుకున్నాడు: ఆమెకి
ఆడపిల్ల. పిన్నికైతే రూపమీద
ఎవంటి ద్వేషమూ లేదు గాని,
సైటీలేడీ అవడం వల్ల యింటిపట్టు
ండే వ్యవధి ఉండదు. ఈ పిన్ని
డికి (వంకాయల) రూపనెలాగైనా
తమార్చి, యావదాస్తి తన కూతురికీ,
తురు సంతానానికీ వచ్చేటట్లు
యాలని దురాశ. అంచేత, రూపని
కం చేసే మార్గాలు అనేకం అవలం
చి, విఫలమవుతూంటాడు. పాత్రలో
టివేషన్ లేకపోయినా, సినిమాకి
విలన్ కావాలి గనక అది భర్తీ
స్తాడు. సూరిబాబుకి మేనమామ
తురు (కుట్టిపద్మ), రాంబాబుకి
పగా స్మార్ట్‌గా వున్న స్లమ్‌సుందరీ
ల్పన) జోడీలుగా ఉన్నారు డ్రీమ్
క్వెన్సులకి! ప్రేమకోసం కరువువాచి,
పిల్లి తప్ప మాట్లాడుకొనేందుకు
వరూ లేక, చందమామతో చెలిమి
సే ఈ రూప, బాబాయిలూ ఆంటీ
తో, బ్రెడ్ బట్టర్ కంటె చద్దివన్నం
వుందని, తనతో ఆడుకొనే పిల్లలు
క్కడ చాలా మంది ఉన్నారని
మ్‌లో ఉండిపోతుంది. ఇద్దరు
బులూ ఈ పిల్లని వారి బంగాళావద్ద
దిలేసి వచ్చినప్పటికీ, మళ్లీ స్లమ్‌లోకే
చ్చేస్తుంది. శిఖామణి అనే బోర్రాగేస
ని పథకంలో, ఊళ్లోవున్న పిల్లులన్నీ
రి స్థావరంపై దాడి చేయడంతో,
పకి విముక్తి లభిస్తుంది; అప్పటికే
మారిపోయిన జేబుదొంగలు మంచి
వారై పోతారు. సుజిత పెర్‌ఫార
మెన్స్‌కి, యస్ జానకి కంఠం తోడ
యింది. దర్శకత్వం: మౌళి. నిర్మాత:
రామోజీరావు; ఎగ్జిక్యూటివ్: అట్లూరి
రామారావు.

## భరణీ పిక్చర్
## 'అత్తగారూ జిందాబాద్'

ఈ కామెడీ పిక్చర్‌లో నవ్వులు విరిజిమ్మేందుకు భానుమతి వైజి మహేంద్ర, పద్మనాభం, కోట శ్రీనివాస రావు, సాక్షి రంగారావు, ఘంటసాల విజయకుమార్ మున్నగువారున్నారు. అన్నగారు (సోమయాజులు), తన కుటుంబ పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉండటంతో సోదరి రాజేశ్వరికి (భానుమతి) టెలిగ్రామ్ యిస్తాడు. తిరుగు టెలిగ్రామ్‌తోబాటు ఆమె రైలు దిగివచ్చి, రంగప్రవేశం గావించి, అన్న గారి కుటుంబం రిపేరు చేయడానికి పూనుకొని, మొదటి షరతుగా అన్న గారిని తెర వెనక్కు తప్పిస్తుంది – తను యావదాస్తికీ పవర్ ఆఫ్ అటార్నీ పుచ్చుకు! న్యాయస్థానంలో చెల్లని సినిమా తమాషా అది. అన్నగారి కుటుంబానికి వచ్చిన కష్టం ఏమిటంటే, అయిదులక్షలు నుంచున్న పాళంగా యివ్వమని పెద్దకొడుకు కోరినప్పుడా తండ్రి నిరాకరించడంతో, ఆ పెద్ద వాడు యిల్లు వొదిలి వెళ్లిపోతాడు; రెండోవాడు (ఘంటసాల రత్న కుమార్) యిల్లు బట్టిన మామయ్య చింతపిక్కల చిన్నారావు (కోట శ్రీనివాస

రావు) ప్రభావంతో పేకముక్కలతో పొద్దుపుచ్చుతూంటాడు. అటువంటిదే ఆయిన కూతురు. తన భర్తతో పుట్టింట్లోనే వుండిపోతుంది. మూడోవాడు కళ్యాణ్ (కళ్యాణచక్రవర్తి) మంచివాడే గాని వరసకి మేనమామ అయిన పెద్ద మనిషి, తన కూతురికి యింట్లో పాలేరు వల్ల కడుపురాగా ఆ అమ్మాయిని తనకి కట్టబెట్టజూస్తే, భయపడి పారిపోతాడు; రైలులో కలిసిన పశుపతి (మహేంద్ర) తమ యింట్లో ఆశ్రయమిచ్చి, మరదలుతో (రోహిణి) కళ్యాణ్ పెళ్ళిజరిపిస్తాడు. ఏదంపతులకైతే మొట్టమొదట సంతానం కలుగుతుందో, వారికే తన అన్నగారి కోటిరూపాయిల ఆస్తి జెందుతుందని మరొక పత్రం పుట్టిస్తుంది రాజేశ్వరి – అంటే మేనత్త అయిన అత్తగారు. వొదిలేసిన అన్న పూర్ణని వెనక్కి తెచ్చుకుంటాడు రెండోవాడు. తొందరగా ఒక పిల్లని కని కోటి రూపాయిలు కొట్టేయాలని ముగురు దంపతులకీ ఆరాటం. సినీ డైరక్టరు (పద్మనాభం) పథకంలో సెట్‌మీద గందరగోళ మంతావున్నా, అయిదు లక్షలు యివ్వలేదని ఆగ్రహించి వెళ్లిపోయిన జ్యేష్ఠని పాప, వూయలలోనిదవడంతో 'అత్తగారూ జిందాబాద్' అంటారు. అందరూ. భానుమతి అభిమానులు మెచ్చుకొనే ఈ చిత్రానికి దర్శకత్వం పి సి రెడ్డి; నిర్మాత: భానుమతి.

దేశమొక కవిత; పట్నమొక నాటకము – ఈ రెండు కలిపినప్పుడే సంగీత ప్రదర్శన అవుతున్నది.

—లాంగ్‌ఫెలో



## విజయ మహేష్
## 'మారణహోమం'

భూపతి లారీ సర్వీసులోని డ్రయివరు శివా (కృష్ణంరాజు), తను ప్రేమించిన పార్వతిని (రాధిక), మరింకెవరికో కట్టబెడుతూండగా, సినీహీరో విజృంభణతో ఆమె మెడలో తాళి కడతాడు; క్లీనరు గంగులు (సత్యనారాయణ) అండగా నిలబడతాడు. తమకు కలిగిన అబ్బిగాడిని అమెరికాలో లారీ డ్రయివరు చేస్తాననే శివా, 'కాదు కాదు - బ్రేక్ ఇనస్పెక్టరుని' చేస్తాననే వరకు మానసికంగా ఎదుగుతాడు. అందమైన పార్వతిపై కన్నేసిన భూపతి, శివాని రెండు రోజులు డ్యూటీ మీద పంపి, నలుగురు రౌడీల సాయంతో పార్వతిని బలాత్కరించబోగా ఆమె కత్తిపీటతో తనని తాను పొడుచుకు చనిపోతుంది - భర్తకొక లెటర్ రాసి! పొత్తికడుపులో పొడుచుకున్నాక, అంత విపులంగా లెటర్ రాసే శక్తి ఆమెకెలా వచ్చిందని మనం అడక్కూడదు. దుష్టుడైన భూపతిపై కక్ష తీర్చుకుందామనుకొన్న శివాని మోసగించి, పోలీసు యినస్పెక్టరూ, ప్లీడరూ ఆ లెటర్ కాజేసి, తగలబెట్టి, శీలాన్ని శంకించిన భర్తే ఆమెని చంపాడన్న నేరంపై, ఇరవైఏళ్లు జైలుకి పంపిస్తారు. దర్శకులు కోదండరామిరెడ్డి కథని ఎంతో నేర్పుగా చక్కటి మలుపులతో జుట్టు తెల్లబడిన శివా సెంట్రల్ జైలునుంచి బయటికి రావడంతో ప్రారంభిస్తారు. హారథరావు డైలాగ్సు బావున్నాయి. కృష్ణంరాజుది చిరపరిచిత పాత్ర. కుష్బు మంచి మార్కులు తెచ్చుకుంటుంది. నిర్మాత : వజ్జె సుబ్బారావు.

## పవనావారి
## 'శ్రీమతి ఒక బహుమతి'

ప్రతీ ఉదయం ఆఫీసుకి రాగానే, టైపు మిషనుకి నమస్కరించి కవరు తెరిచే లలిత (జయసుధ), తన పేరు రామనామంలా తెల్లకాగితం మీద ఎవరో టైపుచేసి రోలర్‌లో వుంచడం చూసి, మొదటిరోజు కంగారుపడుతుంది; రెండోరోజు ఆశ్చర్యపడుతుంది; మూడోరోజు విసుక్కుంటుంది; నాలుగోరోజున నవ్వుకుంటుంది. ఒకరోజు 'లలితాశతం' అందులో లేకపోవడం, చేతివేలుకి నిమ్మకాయడిప్ప తొడుక్కున్న కాషియర్ సుబ్బారావు (చంద్రమోహన్) వెర్రి మొగం వేయడంతో, దోషి ఎవరో తెలిసిపోతుంది. తాము పిల్లల్ని కనకూడదనీ, చిన్నపిల్లలైన లలిత తమ్ముళ్లిద్దరినీ వృద్ధిలోకి తీసుకు రావడమే తమ జీవిత ధ్యేయమనీ కూడబలుక్కుని జీనితపుటుయ్యాలలో దంపతులవుతారు; టైపిస్ట్ యువతి భర్తచాటు భార్య అవుతుంది; స్వతహాగా సద్వర్తనుడైన సుబ్బారావు గృహనిర్వహణ భారం ఆమెకి వొదిలేస్తాడు. బలరామ్ (నరేష్), కృష్ణలకు, (తులసీరామ్) ఈ అక్కాబావలే తలిదండ్రులు. తాము వుంటున్న యిల్లు కోర్టువారు జప్తు చేసినా,

పౌడరు డబ్బుకి ప్రాధాన్యమిచ్చే కమల (అరుణ) బలరామ్‌కి భార్య అవుతుంది; తన 'కూతురు దివ్య (కల్పన) అమెరికా వెళ్లకుండా, బియస్‌సి చదువుతున్న కృష్ణకు యిచ్చి, భద్రాచలం రుద్రయ్య (విసు) అసావాదితో ('బ్రహ్మ' మార్గాన) ముక్కు ఎక్కడ వుందీ అంటే, కుడిచేతిని మెడమీదుగా వేసి చూపడం) పెళ్లి జరిపించి, కూతురిలో పరివర్తన, అల్లునిలో ప్రయోజకత్వమూ తెప్పిస్తాడు. తమ్ముళ్లకోసం తనజీవితం, మోతాదుకి మించిన మమతతో ధారపోసిన లలిత, ఈ మహానాటకంలో నిష్కారణంగా బలి అవుతుంది. పిక్చరులో నవ్యత ఉందిగాని అయిదుకోట్లు ఆస్తిగల తండ్రి, తన కూతురిని ఈ విధంగా హింసించడానికి తగుకారణం కనబడదు. జయసుధకోసం ఈ చిత్రం చూస్తారు — ఎందుకంటే ఆ పాత్రలో స్త్రీ హృదయ దర్పణం ఉంది. దర్శకత్వం: విసు. నిర్మాతలు: దయాకర్, కరుణాకర్. సమర్పణ: ఎవికె రెడ్డి.



ఎవరెవరు? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కువమంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది: 15-1-1988.

**JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004**

కొత్త రుచులు

# ఆప్కో చేనేతలు

విశిష్టమైన రూపకల్పనల్లో నాణ్యమైన చేతి అద్దకపు అద్భుతాలు
ఈ తరుణంలో మీ అభిరుచులకి అనుగుణంగా ఎన్నెన్నో
రకాలు అధునాతనమైన నేతల్లో సాంప్రదాయపు సొంపులో
కళ్ళు జిగేలు మనిపిస్తాయి. అన్ని సందర్భాలలో సరిపోయే
సరికొత్తరకాల్లో ఆప్కో చేనేతలు.
అపూర్వ కళాఖండాలను బోలు గుంటూరు, గద్వాల,
వెంకటగిరి జరీ చీరలు, సిద్ధిపేట, ఉప్పాడ, కొత్తపల్లి
బుటా చీరెలు, పుట్టపాక, నారాయణపేట, ధర్మవరం,
పోచంపల్లి టై అండ్ డై చీరెలు, దుప్పట్లు, తువ్వాళ్ళు,
లుంగీలు, ధోవతులు, మరెన్నో చేనేతలు.
సామాన్య కుటుంబీకులకు పనికివచ్చే జనతా చీరెలు,
ధోవతులు, చౌక ధరలలో
కంటి కింపైన డిజైన్లలో పాలియెస్టర్ చొక్కాలు
మీకు దగ్గరలో గల ఆప్కో ఫాబ్రిక్స్ విక్రయశాలను నేడే దర్శించండి
'సులభ వాయిదాలపై అరువు సౌకర్యం గలదు.'




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కో ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
హైదరాబాద్-500029

సీరియల్

# భ్రమర గీతం

## అచ్యుతవల్లి

గడిచిన కథ : రామజోగిపంతులు చలపతికి పెద్ద చదువు చెప్పిస్తాడు. బెంగాలీ బాబుని పెళ్లి చేసుకు, అయిదుగురు ఆడపిల్లల తల్లి అయాక, విడిపోయిన మేరిలిన్, తాతగారు రామజోగి పంతులు సువిశాల భవనంలో ఉంటూ వున్నది. మేరిలిన్ కూతురు భ్రమర, చలపతిని అభిమానించే భ్రమర, ఈ వాతావరణంలో యిమడలేక మరొక పట్నంలో స్వతంత్ర జీవనం సాగిస్తోంది .... ఇక చదవండి.

సంసారభారంలో కూరుకు పోయాడు చలపతి. వారానికి పదిరోజులకి మేడలోకి వెళ్ళేవాడు కన్పించినప్పుడల్లా సుమన ....................

"మీ బెటర్ హాఫ్ ఉత్తరం వ్రాస్తోందా!" అనేది. నవ్వేసేవాడు. ఊళ్ళో మనుష్యులకి కూడా చలపతి అంటే నమ్మకం గౌరవం కలిగింది. జోగిపంతులుగారి ఆస్తి అంటే మాటలు కాదు. ఉదయం వెళ్ళితే రాత్రికి గాని రాలేకపోయేవాడు. ఒకరోజు గోపాల్రావుగారు రామజోగిపంతులుగారి ఇంట్లో చూసాడు చలపతిని.

"ఈ అబ్బాయిని ఎక్కడ పట్టావయ్యా – చాకులా వున్నాడు" అన్నాడు. చలపతి ఆ రోజు తను వెళ్ళిన పని వివరాలు చెప్పి వెళ్ళాక.

"మనవాళ్ళ అబ్బాయే, ఎదురింటి లక్ష్మణరావు గారి అబ్బాయి. యం. ఎ. ఎల్. ఎల్. బి. ప్యాసయ్యాడు" అన్నాడు. గోపాలరావుగారు పెద్ద బిజినెస్‌మాన్. వేళ్ళమీద లెక్క పెట్టాల్సిన ధనిక వర్గానికి చెందినవాడు. రామజోగి పంతులుకి ఆప్త మిత్రుడు. పంతులుగారి గృహ విషయాలన్నీ గోపాలరావు గారితో చెప్పుకునేవాడు. ఇంతకాలం కొడుకులకి కూతుళ్ళకి దూరంగా వున్నానన్న బెంగ, మేరిలిన్ రాకతో పటాపంచలు అయిపోయింది. ఆడపిల్లలతో వచ్చింది అనే ప్రేమతో మనుమరాలి మీద ఇంటి వ్యవహారాలన్నీ పెట్టేసి సుఖంగా వున్నాడు.

"చూడు పతీ, ఈ ఆస్తులన్నీ తాతలనాటి నుంచి సంక్రమించటం వల్ల తలా ఒక చోటా వున్నాయి. మానేజ్ చేయటం చాలా కష్టం. అబ్బాయిలని రమ్మని వ్రాసాను. ఈ లోగా నలుగురి చెవినా కాస్త మాట వేసి వుంచు. అందరి ఆమోదంతో అమ్మేసి ఎవళ్ళ వాళ్ళకి డబ్బు ఇచ్చే

స్తాను" అన్నాడు జోగిపంతులు.

"అర్జంటుగా అమ్మదల్చుకుంటే మంచి ధర రాదేమో, తాతగారూ!" అంది మేరిలిన్.

"మనకా సందేహం అఖ్కర్లేదు.. గోపాల్రావు మామయ్య చూసుకుంటారు ఆ విషయాలు" అన్నాడు జోగి పంతులు. మేడంతా బాగు చేయించింది. పెరటి వెంపు పడిపోయిన గోడలన్నీ కట్టించింది. పెరటినిండా అరటి, కొబ్బరి, మామిడి మొదలయిన మొక్కలు నాటించింది. తాతగారు ఒక్కరూ వున్నప్పుడు ఇంటి మీద శ్రద్ధ చూపేవారు కాదు. అంచేత శిథిలమయిపోతూ వచ్చింది. ఇంత సిరిసంపదలని వదులుకుని వాళ్ళ వాళ్ళ జీవితాలని, వాళ్ళు తలుచుకున్న పంథాలో నడుపుకుంటున్నారని ఆయనకు బాధగా వుండేది. తన ఆశ్రయం కోరి వచ్చిన మనుమరాలికి అందుకనే పిల్లలితో సమంగా భాగం పంచి ఇచ్చాడు.

మేరిలిన్, పినతల్లీ మేనమామలు వచ్చేసరికి ఇల్లాంతా సర్దించింది. వంట వాళ్ళు ఇద్దరు వున్నారు. నవుకర్లు ఇద్దరు. ఆడ పనిమనుషులు ఇద్దరూ. ఏది కావాలంటే అది చేసేస్తూ ఇల్లంతా తిరుగుతున్నారు.

"ఎంత బాగా మెయిన్‌టెయిన్ చేస్తున్నావే, నా కళ్ళ ముందర పెరిగిన దానివి" అంది సునంద.

"అచ్చంగా మన చిన్నప్పుడు అమ్మ వున్నప్పుడు లాగా వుంది ఇల్లాంతా" అన్నాడు అఖిల్.

"తెలుగు వంటలన్నీ బాగా చేయిస్తున్నావే" అంటూ మెచ్చుకున్నాడు అనిల్. అనిల్ భోజన ప్రియుడు. పప్పు, రెండు కూరలు, పచ్చడి, ఆవకాయ, సాంబారు, రసం, పెరుగు వుండాలి. అందరూ వారం రోజులు ఇల్లంతా సందడిగా తిరిగారు.

"అక్కయ్య కూడా వచ్చి కళ్ళబడితే బాగుండునురా – పెద్దవాడ్నయి పోయాను" అన్నాడు జోగిపంతులు.

"ఎంత, కేబులు యిస్తాము లెండి" అన్నారు అనిల్, అఖిల్, సుశీల వచ్చే సరికి పదిరోజులు పట్టింది. కూతురు, తన తండ్రి వద్ద సుఖంగా వుండటం చూసి కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంది.

"నా పోలిక రాకూడదనుకున్నాను, మెర్రి" అంది.

'పోనీలే అమ్మా – నీపోలిక వచ్చినందువల్ల నేనేమీ బాధపడటం లేదు తాతయ్యగారి అదరణతో నాకు సుఖంగానే గడుస్తూంది. సుమనకి సంబంధం కుదిరితే మీరుండగానే సరదాగా పెళ్ళి చేద్దామని వుంది" అంది మెరిలిన్. సుగుణ భర్త కూడా వచ్చారు. రామ జోగి పంతులుగారు తన కుటుంబాన్నంతా సంతృప్తితో చూసుకున్నారు. తాత తండ్రులు ఇచ్చిన స్థిరాస్థులు ఏవీ పైసా పాడుచేయలేదు. ఇంకా ఇంకా వృద్ధిచేసారు. సంతతి జాతి సంకరమయినా వృద్ధి చెందింది. తనకేమీ లోటులేదు, అనుకున్నారు. మనిషికి ఉన్నది తృప్తి; పసరానికి తిన్నది పుష్టి, అనుకున్నారు.

"ఏదయినా ఫ్యాక్టరీలో పెట్టుదా మంటున్నారు గోపాల్రావుగారు. నామ టుకు నాకు ఏదయినా లిమిటెడ్ కంపెనీలో షేర్లు తీసుకుంటే నయం అన్పించుతోంది. లాభాలు ఎవరి పేరు నున్న షేర్లుకి వాళ్ళకి పంపేస్తూ వుంటారు," అన్నాడు అఖిల్.

"ఒకళ్ళ బిజినెస్‌లో వాటాలు కల వడం ఎందుకు? మీరే వేరుగా బిజినెస్ ఫర్మ్ మొదలుపెట్టండి: డబ్బు వుంది; మనుష్యులు వున్నారు. ఇంకా దేనికి వెనకా ముందూ ఆలోచన?" అన్నాడు గోపాల్రావు. పది పదిహేను లక్షలఆస్తి స్వంతంగా బిజినెస్‌లో తిప్ప గలమా? - అని తటపటాయించారు.

"మీకేం భయం లేదు. చలపతి ఉన్నాడు. సలహా సంప్రదింపులకి పెద్ద తలకాయ లక్ష్మణరావు వున్నాడు. తిరగటానికి నేను వున్నాను."

"పెద్దమనిషి అంతలా ధీమా ఇస్తూంటే వద్దనలేకపోయారు అన్న దమ్ములిద్దరూను. లావాదేవీలు, 'ఆర్. జె. పి.' కంపెనీ అవతరణమూ అయ్యే సరికి ఆరునెలలు పట్టింది. మళ్ళీ జీవిత రథం ఇంకొక బాటమీద సాఫీగా నడవటం ప్రారంభించింది చలపతికి. సుమన తీరుబాటుగా వుంది.

"యువత సోమరితనం భరించ లేదు. చైతన్యం ఎక్కువ— వాళ్ళు వర్క్ చేయటంలో సిన్సియర్‌గా వుంటుంది. అది సక్రమ మార్గంలో ఉప యోగించుకోగలగాలి. అప్పుడే దేశ మంతా సుభిక్షమవుతుంది. యువత లోని శక్తియుక్తులని సక్రమ మార్గాన నడిపించడానికి సరయిన నాయకుడు వుండాలి" అన్నాడు చలపతి.

"సరయిన నాయకుడు అంటే?" అంది సుమన.

"నిర్మాణాత్మక కార్యక్రమము అని గాంధీజీ అనేవారు. ఒక గ్రామం వుంది అనుకుందాము. ఆ గ్రామంలో రెండు మూడు వందలమంది యువతీ యువ కులు వుంటారు. వాళ్ళు వ్యవసాయ కుటుంబానికి చెందినా, భూస్వామ్య కుటుంబానికి చెందినా వయస్సు, జీవ శక్తి వాళ్ళని ఒకే వర్గం వాళ్ళ క్రింద చేస్తుంది. వాళ్ళు ఒక సంఘంగా ఏర్పడ వచ్చును. వాళ్ళ వూరికి లేనిదేమిటో ముందు ఆలోచించాలి. గతుకుల రోడ్లు గుంటలతో మెట్టపల్లాలతో మురికి నిలిచిపోయే రోడ్లు వుండి వుంటాయి. చక్కటి సాఫీ అయిన రోడ్లు వేసుకో వచ్చును. పిల్లలు వానల్లో వరదల్లో తడవకుండా, పొరుగూరికి పోయి చదువుకోనవసరం లేకుండా ప్రాథ మిక పాఠశాల, దానికి చక్కని తోటతో వున్న ఆవరణలో పకడ్బందీ అయిన భవనం, యువకుల కాలక్షేపానికి లైబ్రరీ, ఇంకా స్తోమత వుంటే ఓపెన్ ఎయిర్ థియేటర్ - అవి అన్నీ సమకూర్చుకోవాలి. యువజనులు తమ వూరిని ప్రేమించగలగాలి. కాస్త హైస్కూల్ దాటిన, చదువు సేవ పట్నాలకి ఎగబ్రాకి ఏ గుమస్తా ఉద్యోగమో చూసుకుంటారు. కారణం: యువతకి కావలసిన వినోదాలు వింతలు పట్నాలలో వుండటం!"

(ఇంకా వుంది

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం, ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు — పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు — జవాబులు | 15 – 00 |
| జాబులు — జవాబులు | 13 – 00 |
| అల్లికలు — కుట్లు | 30 – 00 |
| అందాలు — అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |



20/— రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి - విజయవాడ-2

సీరియల్

# ప్రతి గురువారం



గడిచిన కథః మెక్లవిన్ దంపతులు 'ఆర్కయివ్' వారపత్రిక ప్రారంభిస్తారు. జేన్, నెమ్మది నెమ్మదిగా ప్రూఫ్‌లు దిద్దడం, పేజీలు కట్టించడం, తను జబ్బుపడ్డప్పుడు పత్రికను వెలువరించగలగటంతో ఆమె పేరు కూడా ఏడిటర్‌గా వేస్తాడు బాబే .... ఇక చదవండి.

ఒకరోజు 102 డిగ్రీల జ్వరముతో యింటికొచ్చాను. ఆవేళ సోమవారం. బుధవారం నాటికి ఎనిమిది పేజీల పత్రిక అవాలి. నేను పక్కమీద పడిపోయాను - ఏమీ చెయ్యలేను. కాని గురువారం నాటికి యధాప్రకారం పత్రిక మార్కెట్లోకి వచ్చింది. అశక్తుణ్ణయి నేను పక్కమీద పడివుండగా, జేన్ మేటరు రాసింది. పత్రిక కంపోజ్ చేయించింది, అచ్చువేయించింది.

అంచేత, ఆమె పేరుకూడా ఎడిటర్‌గా వేస్తున్నాను. ఇకనుంచి "నేను" కాదు - "మేము."

## 8

పత్రిక పెజీలు మడవడమనేది తమాషా అయిన తంతు. ఒకరోజు రాత్రి, ఆ దారిన పోయే రైతు, ప్రెస్ గుమ్మం దగ్గిర నిలబడి — యిక్కడ మడత పని వున్నట్టుందే — అన్నాడు.

పత్రికలు మడవాలనే సంగతి నాకు తెలియదు. మిషన్‌లోకి వెళ్ళి, వాటంతటవే మడవబడి, వస్తాయనుకునేదాన్ని. పెద్ద పెద్ద పత్రికలు అంతేట గాని, మా హనీబ్రూక్‌లో అటువంటి యంత్రాలు లేవు. మేమింకా బెంజమిన్ ఫ్రాంక్లిన్ దినాలలోనే ఉన్నాం, తప్పనిసరిగా అవసరమయ్యే సామాను మట్టుకే వుంది మా ప్రెస్సులో.

మూడు పత్రికలు ప్రింటవుతున్నాయి అక్కడ. లక్షా యిరవై వేల కాయితాలు ప్రతివారం మడవాలి. మా ఒక్క ఆర్కయివ్ పత్రిక మడత పని మూడు గంటల నుంచి ఎనిమిది గంటల సేపు పట్టేది. మడిచే వాళ్ళ సంఖ్యని బట్టి, మాటాడుకునే విషయాల్ని బట్టి పని తొందరగా తెమిలేది. బుధవారం రాత్రి హైస్కూలు పిల్లలు వచ్చి సాయం చేస్తూండేవారు.

మా బైండర్ బాయిస్ వయస్సు పధ్నాలుగు, డెబ్బయి మధ్య ఉండేది. హైస్కూలు పిల్లలతో బాటు బాబ్ మేనత్త లిద్దరు కూడా వచ్చేవారు. ఆంట్ జెన్నికీ (బాబ్ మేనత్త) అయిదుగురు పిల్లలు, పదిహేనుగురు మనుమలు, చేతకి తగ్గ పని లేదు, ఎవరికైనా ఏదైనా సహాయం చేస్తాను - అంటూండేది ఆంట్ జెన్ని. ఇక వాళ్ళ రెండో మేనత్త ఆంట్ ఫాన్‌కి బాగా చెముడు కాని, ఆవిడకి మొక్కలు

పెంచడమంటేనూ, తోట పని అం టేనూ చాలా సరదా. గార్డెనింగ్‌లో ఆమెకి ఎన్నో ప్రయిజులొచ్చాయి. ప్రతి వారం పువ్వులకి, మొక్కలకి సంబంధించిన కొత్త విషయాలు కనిపెడుతూ వుంటుంది. ఎర్ర టొమాటోలు మంచివా, ఆకుపచ్చ టొమాటోలు మంచివా అను వాగ్వాదం వచ్చింది. "నీ రక్తం ఎలా ఉంటుందో, దానిని బట్టి తెలుసుకోవచ్చునే!" అంది ఆంట్ ఫాన్. ఒక రోజు కుమ్మరి పురుగులు తీసుకొచ్చి, వాటి గురించి అరగంట సేపు చెప్పింది.

మడతపని ప్రారంభమవడమేమిటి - యింక తెగవాగుడే! మిషన్ శబ్దాన్ని అధిగమించి వినిపించేందుకు, రేడియో ఫుల్ వాల్యూమ్‌లో పెట్టేస్తాం. అటు మిషన్ శబ్దం, యిటు రేడియో హోరు - ఈ రెండింటినీ మించి వినిపిస్తూం టుంది ఆంట్‌ఫాన్ గారి ఉపన్యాసం.

రేడియోలో ఏమి ట్యూన్ చెయ్యాలా అనేది ఎప్పుడూ వివాదగ్రస్తమే! బాబ్ ఏమో వార్తలు పెట్టమంటాడు: కొందరు శాస్త్రీయ సంగీతం పెట్టమంటారు; మరికొందరు వాద్య సమ్మేళనం పెట్టమంటారు; పిల్లలేమో జాజ్ పెట్టమంటారు. ఏమయితేనేం. మొత్తానికి అంతా తలో కాస్త. ఏ ఒక్క కార్యక్రమం పూర్తిగా వినడం పడదు. హనీబ్రూక్ లోని రేడియో, మార్కొని మొదటి రోజుల్లోది; అంచేత, అది అప్పుడప్పుడు ఆగిపోతూండేది. అలాటప్పుడు కరువు తీరా కబురు.

ఎవరైనా లక్ష్యసాధనకి కావలసిన మైత్రి గురించి చెప్పుకోవలసివస్తే, పత్రిక మడవటం గురించి చెప్పాలి. అది చాలా కష్టమైన పని. చేసేవాళ్ళు ఆడుతూ పాడుతూ చేసేస్తారు. ఒక్కో రోజున నా పాదాలు ఎంత వాచిపోయేవంటే, జోళ్ళు విప్పేసి, మేజోళ్లతో తిరిగేదాన్ని ప్రెస్‌లో.

ప్రతివారం యజ్ఞం అంటే నమ్మండి

నేను యడ్వర్టయిజ్‌మెంటులు చూసుకుంటానన్నాను. అబ్బాయిని బళ్ళో వొదిలిపెట్టి, అమ్మాయిని కార్లోవేసుకు, వెళ్ళవలసి వస్తూండేది యడ్వర్టయిజ్ మెంట్లకి.

అమ్మాయి చంటిపిల్ల గదా, ఆకలేసి అప్పుడప్పుడు ఏడుస్తూ వుండేది. అమ్మాయి పాలసీసా ఎప్పుడూ కారులో ఉండేది. పది పదిహేను నిముషాల వ్యవధి వున్నప్పుడు క్లారెన్స్ షాపులోకి వెళ్ళి కూచునేదాన్ని. పాప పాలు తాగుతుండగా, నేను క్లారెన్సూ ఆ వారం రావలసిన యడ్వర్టయిజ్‌మెంటు గురించి మాట్లాడేవాళ్లం. యడ్వర్టయిజ్‌మెంట్‌తో బాటు అతని సంసార తాపత్రయం చెప్పుకునేవాడు.

మొదటి సంవత్సరంలో 'ఆర్కయివ్' గురించి చాలా కొద్దిమందికే తెలిసింది: ఆ తెలిసిన కొద్దిపాటి కూడా పత్రికకి లాభదాయకమైనది కాదు. 'పత్రికల్లో ప్రకటన లెందుకు - దండగ' అనేవారు. కొందరు నాజూకుగా చెప్పేవారు; కొందరు కటువుగా చెప్పేవారు. కాని, మొత్తంమీద అందరూ చెప్పింది అదే! (ఇంకా వుంది